శ్రీరామచంద్రాయ నమః.

# ఆత్మబోధము.

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య విరచితంబగు

సంస్కృతగ్రంథమునకు ఆంధ్రీకరణము.)

చిత్తూరు పురపువాస్తవ్యులును న్యాయవాదులును అగు

మ॥ జె. కృష్ణరావు. బి. యె. బి. యల్. గారిచే

నాంధ్రీకరింపఁబడినది.

శ్రీమదాంధ్రవిద్యావాచస్పతి, సాహిత్య సరస్వతి,

విద్యావినోద, కవిభూషణ, శతావధాని,

విద్వాన్, దోమా. వేంకటస్వామి గుప్త గారిచే

లఘుటీకా వివరణంబులు వ్రాయఁబడినవి.



1934

ఆనందముద్రణాలయమున ముద్రితము.

# తొలిపలుకు.



ఈ యాత్మబోధము చూపునకుఁ జిన్నదిగా నగుపట్టి నను నిజమునుకు మహా గ్రంథము. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యజగద్గురువుల వారిచే విరచితము. చిత్తూరు పురవాస్తవ్యులును న్యాయవాదులును, ఆస్తికరత్నములును, కవితారాసిక్యసంపన్నులును అయిన మ॥ జె. కృష్ణరావు బి. యె, బి. యల్. గారు ఈ యాత్మబోధ సంస్కృతకృతి శ్లోకములకు అనుసరణముగాఁ దెలుఁగుకందముల నందముగా రచియించిరి. శ్రీవారాత్మబోధ నొందియే యీయాత్మబోధ గ్రంథంబుం దెల్గించిరని యీకందంబుల యందలి భావంపుంబొందికనుబట్టి చెప్పనయ్యెడిని. శ్రీవారుజ్ఞానవయోవృద్ధులు, శాంత్యాది సద్గుసంపన్నులు. వారీ 'యాత్మబోధము' తోత్తను వృత్తములుగా వ్యాఖ్యార్థము వచ్చునట్లు వ్రాసిరి. వీరింకను 'మాతృపటము' 'శ్రీ వేంకటేశ్వర స్తవము' మొ॥ గ్రంథములను రచియించిరి. అట్టి వారొనర్చిన యీ పొత్తముతప్పక లోకోపకారకముగా నుండఁగలదు.

బంగారమునకుఁ బరిమళం బబ్బినట్లుగా శ్రీవారాంధ్రీకరించిన యీ గ్రంథరాజంబునకు (లోకవ్యాపనార్థముగా మిక్కిలి యవసరంబయిన) అర్థాదివివరణంబులను పండితోత్తములును, సుప్రసిద్ధశతావధానులును, శ్రీ బ్రహ్మేశ్వరపు

రాణ శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణాద్యనేక గ్రంథకర్తలును అగు ఈయూరిక్రిస్టియన్ కాలేజీపండితులు-శ్రీకవిభూషణ శతావధాని విద్వాన్. దో. మా. వేంకటస్వామి గుప్తగారు రచియింపుటయేర్పడినది. వివరణసందర్భములో-వేదాంతవిషయకముగానంతయవసరముగాఁ దోఁపకపోయినను శ్రీగుప్తగారు అలంకారాది నిరూపణంబుగూడ నక్కడక్కడఁ చేయుటంచేసి-యీ పొత్తము సంస్కృతాంధ్రసారస్వతవిద్యార్థులకుఁగూడ నుపయోగపడునట్లు గావించియున్నారు. అంతియ కాక యియ్యలంకారాదినిరూపణంబునంచేసి, శ్రీమదాదిశంకరాచార్యుల వారంతటి వైరాగ్య సంపన్నులయియుండినప్పటికిని భాషవిషయంబునందు వారెంత జాగ్రత్తతో నుండినదియును శ్రీ జె. కృష్ణరావుగారి పద్యాంధ్రీకరణం బెంతటి నైపుణ్యంబుతోఁ జేయఁబడినదియును దెల్పఁబడుచున్నది.

శ్రీ జె. కృష్ణరావుగారి తెల్గింపు అనర్గళముగాను మనోహరముగాను ఉన్నది. "ముక్కస్యముక్కార్థః" తెలిఁగింపు గాక- కొందఱి తెలిగింపుంబలె "గార్డెన్‌టుకమ్" పద్ధతి నవలంబింపక- తెలుఁగుతనంబును గోల్పోక భాషాదేవతకొక నవీనాలంకారము కాఁగలదనుటకు సందియంబులేదు. తక్కసాహిత్యగ్రంథములను భాషంతరీకరించుటలో వార వచ్చినను నంతగా నపాయముండదు. కాని వేదాంత గ్రంథంబులను వైద్యగ్రంథంబులనుభాషాంతరీకరించుచో భావంబు పెడత్రోవఁబట్టినచో తజ్జ్ఞానంబునకు దేహంబునకు నపాయంబు కల్గును గదా! శ్రీ వారి తెలిఁగింపునందా జాగ్రత్తయును బెక్కువగాఁ గైకొనఁబడినది.

మొదటను శ్రీగుప్తగారి కందిన శ్రీయాంధ్రీకరణ ములో 20, 64, 65, 68, వ శ్లోకములయిన "ఆత్మచైతన్య" "దృశ్యతే్రశూయతే" "సర్వగంసచ్చిదాత్మానం" "దిగ్దే శకాలాద్యనపేక్ష్య" అనువాని తెలిగింపు లుండ లేదు. దానం జేసి ఆశ్లోకములకు శ్రీగుప్తగారే తెలుఁగు పద్యములు వ్రాసి వివరణము తయారుచేసి యుండిరి. కాని యిటీవల సదరు శ్లోక ముల పద్యములు గూడ శ్రీ జె. కృష్ణరావుగారీ యెండకాలపు సెలవులలో నాకు నొసంగిరి. కాన ఈ పద్యములనే సముచిత స్థానముల యందు సవివరణముగా శ్రీగుప్తగారమర్చి తమ పద్యములను సవివరణముగాఁ బాఠాంతరములుగాఁ జేర్చి యున్నారు.

శ్రీమదాదిశంకరులవారు జగద్గురువులు, వా రొసంగిన వేదాంతజ్ఞానంబు ఈరీతిగా శ్రీ జె. కృష్ణరావుగారి చేతను శ్రీ దోమా - వేంకటస్వామిగుప్తగారి చేతను ఆంధ్రలోకంబు నకుఁ బంచిపెట్టఁబడుచున్నది. ఆంధ్రవిద్యార్థులు గూడ ఈ గ్రంథరాజంబు నుపయోగించుకొని లాభంబు నొందుట కను కూలముగా దొరతనమువారును విశ్వవిద్యాలయముల వారును ఈపొత్తంబును కళాశాలాదులలోఁ బాఠ్య గ్రంథముగా నియ మింతురు గాత మని కోరుచున్నాను.

పరమాత్ముఁడెల్లరకును శుభదుం డగునుగాక.

ఇట్లు సుజన విధేయుఁడు.

మద్రాసు.
జూలై - 34.

విద్వాన్. తాటిమాగ్రికులపల్లె. ఆర్ముగం పిళ్లై,
తెలుఁగు పండితుఁడు, ముత్యాలపేట హైస్కూలు.

# విజ్ఞాపనము.

"శంకర శ్శంకర స్సాక్షాత్" అనఁబరఁగిన శ్రీమ దాది శంకరాచార్యపరబ్రహ్మంబునకు నమస్కారంబు. చిత్తూరుపుర వాస్తవ్యులును అన్యాయ వాదులు గాని న్యాయవాదులును గీర్వాణాంధ్ర భాషావేత్తలును కవితారసికులును ఆత్మానాత్మ వివేకులును అయిన శ్రీ జే. కృష్ణరావు బి. యే. బి. యల్. గారిచే శ్రీమదాదిశంకరులవారియొక్కయాత్మబోధ గ్రంథము మనోహరంబుగా తెలుఁగు పద్దెంబులుగా నాంధ్రీకరింపఁబడినది. శ్రీమదాదిశంకరులవారి స్తోత్రమును బాగుగా నాంధ్రీకరించుటకు నెంతటి యధికారం బుండవలయునో ప్రత్యేకముగా చెప్ప నేలని ఈ తెలిఁగింపునుగూర్చి శ్రీవిద్వాన్ తా. ఆరుమ్మగంపిళ్లె గారి స్తోత్రమునందు వ్రాసిన పీఠికలో ప్రశంసించియున్నారు. దానిక్రిందనే నాసంతకము గూడనున్నట్లు భావింప నగును. నాకు సుమారొక సంవత్సరముక్రింద శ్రీవిద్వాన్ ఆరుమ్మగంపిళ్లెగారి స్నేహము లభించినది. వారిటీవల శ్రీ జె. కృష్ణరావుగారొనరించిన యీ యాత్మబోధ పద్యమయాంధ్రీకరణము వ్రాఁత ప్రతిని నాకుఁ గాన్పించి దాని కెవ్వరిచేత నేనియును వివరణము వ్రాయించినచో బాగుగానుండునని వచియించి, అది శ్రీరావుగారి యిచ్ఛయనియుఁ దెల్పిరి. ఎవ్వరెవ్వరో పేర్కొనఁబడిరి. కొందఱునాకును కొందఱువారికిని కొంద ఱి

రుగురికిని కొంచెమో గొప్పయో యనేక కారణంబులం జేసి నచ్చే లేదు.

తుట్టతుద కెట్టెట్టులో యీవివరణభారము రణభార ముగా నాతలం జేరినది. ఇప్పట్టున నా రీతి పెత్తనమునకుం బోయి పెండ్లాడి నట్లయిన దేమో! అంతే కాక నాకు వయోవృద్ధ త్వముగాని జ్ఞానవృద్ధత్వముగాని లేవు.

వివరణ కార్యభార్యమును తలం బెట్టినది బహుశః శ్రీ అరుమగంపిళ్లెగారే యననోపు. "పరగుణపరమాణూన్ పర్వతీ కృత్య" అనునది సుజనలక్షణముగదా? వారి కోర్కెని నేను 'తథాస్తు'అని "చాపలాయప్రచోదితః" గా ఒప్పుకొన్నాను. ఏపాటినిర్వహించినానో "ఆపరితోషాద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్" అను మహాకవ్యుక్తి ననుసరించి నిర్ణయింపం బాఠకమహాశయులదే భారము. పొంకమిందు బహుశః కొఱవడి యుండవోపుననియును ఇతఃపరము వ్రాయు మద్గ్రంథములో నిట్టి లోపంబులు రాకుండునట్లు పెద్దలు నన్నాశీర్వదింతురు గాత అనిప్రార్థించుచున్నాను.

శ్రీ జే. కృష్ణరావు గారు ఆంధ్రీకరించిన ఆత్మబోధము యొక ప్రాత వ్రాంతప్రతి శ్రీ పిళ్లెగారిచే నాకొసంగంబడినది. ఆపద్యములకు నిందుంబేర్కొనంబడిన రీతిగా వివరణము వ్రాయునప్పుడు శ్రీ మదాచార్యుల వారియొక్క మూలగ్రంథ ములోని 20, 64, 65, 68 సంఖ్యల శ్లోకములును అందులకు

శ్రీరావుగారి తెలిఁగింపు పద్యములును ఆ ప్రతియందుండలేదు. అప్పుడు నేను సాహసించి యీ శ్లోకములకుఁ దెలుఁగు పద్యములను వ్రాసి యీ యాచోటులం జొప్పించియుంటిని. కాని యిటీవల ఆశ్లోకములకు శ్రీకృష్ణరావు గారు వ్రాసియుండిన తెలిఁగింపు పద్యములు లభించఁగా శ్రీఆమ్మగంపిళ్లైగారు వానిని చిత్తూరునుండి గైకొనివచ్చి నా కొసంగుటంచేసి ఆపద్యములకు వివరణము వ్రాసి వాని యథాస్థానములలో సమర్చినాఁడను. నాపద్యములనుగూడ (కుండలింఛని) సవివరణముగాఁ జేర్చినాను.

జ్ఞానానుభవముగల శ్రీ రావుగారి పొత్తములో నాపద్యంబులను జొప్పించుట "కాచంమణిం కాంచనమేక సూత్రే" అన్నట్లుండఁ గలదని నా నమ్మిక. ఈ నా సాహసము క్షమింప బడును గాత. *

ఈరీతిగా నేను శ్రీమదాచార్యులవారి పొత్తంబును బరికించు నవకాశము నా కేర్పడునట్లు ఈ యాత్మబోధ

---

* ఈవివరణము వ్రాయుటకుఁగాను నాకు శ్రీ కృష్ణరావు గారిచేఁ బంపఁ బడిన శ్రీవావిళ్ల వారిచేఁ బ్రచురింపఁబడిన శ్రీ ప్రజ్ఞానంద ఘనేంద్ర స్వామి విరచి తాంధ్రటీకాతాత్పర్య సహిత గ్రంథ ముద్రిత ప్రతియును మఱియొక స్నేహితుఁ డొసంగిన దేవనాగరలిపి పొత్తములఘువ్యాఖ్యా సమేతంబయి నదియును దోడ్పడినవి. కనుక నేను తత్తద్వ్యాఖ్యా ప్రచురణ కర్తలయెడలఁ గృత జ్ఞుఁడను.

గ్రంథమును రచియించిన శ్రీ జే. కృష్ణరావు గారి యందును తద్వివరణరచన కార్యమును నాయందు నియోగించిన శ్రీ విద్వాన్ - తా. ఆఱుముగంపిళ్లెగారి యందును నేను కృతజ్ఞుడను.

పరమాత్ముం డెల్లరికిని సౌఖ్యదుం డగునుగాత.

ఇట్లు, బుధ విధేయుఁడు.

దోమా. వేంకటస్వామి గుప్త.

మద్రాసు.
1935

ఆంధ్రోపాధ్యాయుఁడు,
చెన్నపురి క్రైస్తవ కళాశాల,

ఓం నమో నారాయణాయ
15-6-87

శ్రీ

శుభం భూయాత్.

శ్రీ కృష్ణాయ నమః.

# ఆత్మబోధము.

పీఠిక.

కం॥ శ్రీ దివ్యామృత సుఖసం ।
పాదన కార్యావరోధపటువిమతవిషా ।
ఖాదన ధీరుండగు న ।
య్యాదిమ శంకరుని భక్తి నారాధింతున్ ॥

(1) ఈ పద్యంబునకు శివపర్యాయంబుగాను శ్రీమదాది శంకరాచార్య పర్యాయంబుగాను రెండర్థంబులు కలవు.

శివపర్యాయము:—శ్రీ = శోభగల, దివ్య దేవతల యొక్క, అమృత సుఖసంపాదన కార్య = అమృతము వలని సౌఖ్యమునుపొందు పనికి, అవరోధపటు విమత=అడ్డగు గొప్ప శత్రువు వంటి, విష+ఆఖాదన ధీరుండు=విషమును మ్రింగు ధైర్యశాలి, అగు, అ + ఆదిమ=ఆ సర్వంబునకుఁ దొలివాఁ, డయిన, శంకరునిన్=శివునిని (సుఖమును గల్గించు వానిని) భక్తిన్=భక్తితో, ఆరాధింతున్=పూజించెదను.

ఆది శంకరా చార్యపర్యాయము:—శ్రీ సంపదచేత, దివ్య= మంచిదయిన, సుఖ సంపాదనకార్య = మోక్షము అను సౌఖ్యమును సంపాదించునట్టి పనికి, అవరోధ విమత = అడ్డగు చెడ్డమతము అను, విష + ఆ ఖాదన ధీరుండు + అగు = విషమును మ్రింగివేయు తెలివిగలవాఁడగు, ఆ = ఆప్రసిద్ధుఁడయి, ఆదిమ శంకరునిన్ = మొదటి శంకరాచార్యుల వారిని, భక్తిన్ = భక్తితో, ఆరాధింతున్ = సేవించెదను.

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య విరచితాత్మబోధ గ్రంథమునకు ఆంధ్రానువాదకులయిన శ్రీ జే. కృష్ణరావు గారు తమ యొక్క కార్యంబు సుఖముగా నెఱవేఱుటకుఁ గాను సర్వలోక శంకరుండయిన శంకరునకును ఆత్మబోధ గ్రంథమూలరచయిత లయిన శ్రీమదాదిశంకరులవారికి తాను నమస్కరించుట యర్థపడునట్లు మంగళా చరణముగా నిష్పద్యము వ్రాసినారు. శంభు స్తోత్రము సంపత్ప్రదము- "ఈశ్వరాద్ధనం విందేత్," శ్రీకారము కృత్యాదిని "అనుషద తిని మంగళ ప్రదమగుటకు శ్రీకారముతోఁ బ్రారంభింపఁ బడినది. శంక రాదిశంకరార్థములు రెండును బొందింపఁబడి యుంటం జేసి శ్లేషాలంకారము.)

తాత్పర్యము:—శివపర్యాయము.- దేవత లమృతంబు సంపాదించుకొను నుద్యమంబునకు విఘ్నంబగునట్లు విసం బుద్భ

విల్లినది. దానిని ధైర్యముతో భక్షించిన శంకరునిని భక్తితో సేవించెదను.

ఆది శంకరాచార్య పర్యాయము:—మోక్షము సంపాదించు ప్రయత్నంబున కడ్డంబుగా నుండు దుర్మతంబు అనువిసంబు మ్రింగివేయు (ఖండించు) తెల్విగల ఆది శంకరాచార్యుల వారిని భక్తితో సేవించెదను. [చెడ్డమతంబు నవలంబించినచో మోక్షము లభింపదు.]

పయిని రీతిగా దైవంబయిన శంకరునిని కృతికర్త యయిన యాదిశంకరులను నీయనువాదయిత ప్రార్థించినట్లుగా రాఁబోవు పద్యంబునఁ దెలిసెడిని. (ప్రారంభపద్యంబున - "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశ" అను పద్ధతి ప్రకారము "సేవింతున్" అనుక్రియ యుపయోగింపం బడుటంజేసి నమస్కారమును, "విమతవిషాఖాదన ధీరుండగు న య్యాదిమ శంకరుని" అనుచో దుర్మతభంజకజ్ఞానయుక్తుఁ డాదిశంకరాచార్యుఁడుగాఁ బల్కఁబడియుంటంజేసి వస్తునిర్దేశంబును నేర్పడియెడిని.)

కం॥ అని కృతికర్తను దైవం ।
బును మదినెక్కొలిపి యాత్మ బోధమునాంధ్రం ।
బున విరచించెదఁ బండిత ।
జనోపచర్యాఫలమగు జ్ఞానముకల్మిన్ ॥

(2) అని, కృతికర్తను = గ్రంథకర్తను (ఆది శంకరాచార్యుల వారిని), దైవంబును-దేవునిని (శంకరునిని) మదిన్ = మనస్సునందు, నెక్కొలిపి=నిల్పి, పండితజన + ఉపచర్యా ఫలము+అగు=పండితులగు వారిసేవకు ఫలంబయిన, జ్ఞానము-తెల్వి, కల్మిన్ = ఉండుటంజేసి, ఆత్మబోధమున్- "ఆత్మబోధము" అనుగ్రంథమును, ఆంధ్రంబునన్, విరచించెదను.

తాత్పర్యము:—అని గ్రంథకర్త యయిన శ్రీమదాది శంకరులవారిని పరమాత్ముండయిన శంకరునిని డెందంబునందు ధ్యానించి,పండితులను సేవించుటంజేసి యేర్పడిన తెల్విం జేసి యాత్మబోధం బను గ్రంథంబును నాంధ్రంబున రచియించు చున్నాఁడను.

శ్రీ రామచంద్రాయ నమః.

## శ్రీమదాది శంకరాచార్యులవారి

# "ఆత్మబోధ" గ్రంథ ప్రారంభము.

---

అవతారిక:—శ్రీమదాదిశంకరులవారు యంతుఁబొంతు నులేని దుఃఖనుయంబయిన సంసారములోఁబడి కొట్టుకొను వారును కర్మవాసనలు గల మనంబులు గలవారును దుఃఖానుభవేచ్ఛ గలవారును అయిన జనుల దుఃఖంబును బాఁపుకొఱకు తాము లోకంబులకు అకారణబంధువులగుటవల్ల 'ఆత్మబోధ'మను గ్రంథమును వ్రాయు సంగతి తెల్పుచున్నాడు.

శ్లో॥ తపోభిః క్షీణపాపానాం, శాన్తానాం వీతరాగిణామ్ ।
ముముక్షూణా మపేక్ష్యోయ, మాత్మబోధో విధీయతే ॥

క॥ శాంతులు మోక్షాసక్త । స్వాంతులు నిర్ముక్త కిల్బిషవ్రాత తపో ।
వంతులు విదళిత సకల । భ్రాంతులు నీయాత్మబోధ పఠనార్హు లిలన్

టీక. ఇలన్ = భూమియందు, శాంతులున్ = శాంతి నొందినవారును, మోక్ష + ఆసక్త స్వాంతులున్ = మోక్షమునందు నిచ్ఛగల్గిన మనస్సుగల్గినవారును, నిర్ముక్త కిల్బిష వ్రాత = పాపసమూహములనుండి విడివడ్డవారైన (ఇందు సంస్కృతపద్ధతిగా బహువ్రీహికొఱకు "కలవారు" అర్థము తేల్చలేదు), తపోవంతులు = తపస్సుగలవారును, విదళిత సకల

భ్రాంతులు = ఎల్ల విత౦బులయిన భ్రాంతులను వీడినవారును (ఇదియు బహువ్రీహి), ఈయాత్మబోధ పఠన + అర్హులు = ఈ యాత్మబోధ గ్రంథమును జేదువ నర్హులు.

తా. ఈ లోకవ్యవహారంబుల విషయమున నుద్రేకంబు నుడిగి, మోక్షంబునం దిచ్ఛగొని తపంబువలనఁ బాపంబులను విడనాఁడి యే భ్రాంతియును లేనివారే యీ ఆత్మబోధ గ్రంథంబుం జేదువఁదగినవారు. (పయిని లక్షణంబులు లేనివారు చదివినచో వారిందలి సంగతులను జక్కఁగా నవగతం బొనరించుకొనఁ జాలరు.)

అవతారిక. తపోయోగాదుల కన్న మోక్షసాధనమున కీ యాత్మబోధ యెందుకు బాగుగా నుపయోగపడును—ఇదియే యెట్లు ముఖ్యమయినది అను విషయ మీ క్రిందను వివరింపఁబడుచున్నది.

శ్లో॥ బోధోన్య సాధ నేభ్య,స్సాక్షా న్మోక్షైకసాధనమ్ ।
పాకస్య వహ్నివత్ జ్ఞానం, వినామోక్షో న సిధ్యతి ॥

కం॥ పెఱసాధనముల కన్నను ।
నెఱుకయె సాక్షాత్ప్రముఖ మమృతసంపదఁజే ।
కుఱుపఁగ నది యబ్బునె మతిఁ ।
దొఱఁగిన, శిఖిలేకవంట దుర్ఘటముగదా ॥ 2

టీక. పెఱ సాధనముల కన్నను, అమృతసంపదన్ = మోక్షము అను సంపద, చేకుఱుపంగన్ = కల్గించుటకు, ఎఱుకయె = జ్ఞానమె, సాక్షాత్ప్రముఖము = తెలిసినట్లుగా ముఖ్యమయినది. మతిన్ = ఆ జ్ఞానమున, తొఱగినన్ =

ుడిచినచో, అది = (ఆ మోక్షము), అబ్బునే = కల్గునా ?
శిఖి = అగ్ని, లేక, వంట = పాకము, దుర్ఘటము గదా! -
కష్టసాధ్యముగదా !

తా. మోక్షసంపాదనమునకు యాగములు మొదల
యిన వెన్నియో మార్గంబు లున్నయవి. వాని యన్నిటిలోను
జ్ఞానంబే మిక్కిలి సులువుగా మోక్షంబును గల్గించునది.
పాకము గావించుటకు భాండాదులయిన యితరసాధనంబు
లున్నను అగ్నియే చాల ముఖ్యమయిన సాధనంబు. అది
లేనిచో పాకంబెట్లు కష్టసాధ్యంబో అట్లే జ్ఞానంబులేక మోక్ష
ధనము దుష్కరంబు.

(శ్లోకములో "పాకస్యవహ్నివత్" అని యుండుటం
జేసి యుపమానాలంకారముగానున్నది. అయ్యది పద్యము
నందు దృష్టాంతాలంకారముగా మార్పఁబడినది.)

అవతారిక. యజ్ఞయాగాది శ్రుతిస్మృతిచోదితకర్మ
ములచే స్వర్గాది ఫలముగల్గి అజ్ఞానమునశించుచుండఁగా
ఆత్మజ్ఞానముతో నేమవసరమన్నచో కర్మజ్ఞానంబుల కభేదం
బగుటంజేసి యజ్ఞానహారణంబునకు జ్ఞానావసరము చెప్పఁ
బడుచున్నది.

శ్లో॥ అవిరోధితయా కర్మ, నా విద్యాం వినివర్తయేత్ ।
విద్యాఽవిద్యాం నిహన్త్యేవ, తేజస్తిమిరసంఘవత్ ॥

కం॥ అవిరోధమగుట గర్మము ।
లవసాదము సేయనోప వజ్ఞానంబున్ ।
రవిరుచి తిమిరంబును బలె ।
నవగతి నిహతంబొనర్చు నజ్ఞతనెల్లన్ ॥ 3

టీక. కర్మనగాలు యాగములు మొదలయిన రూపములు గల క్రియలు, అవిరోధము+అగుటన్ అజ్ఞానమునకు విరోధము నయినది కాకపోవుటం జేసి, అజ్ఞానంబున్ (ను), అవసాదము సేయన్ = నశింపఁజేయుటకు, ఓఁపవు = శక్తిగలవి కావు. సూర్యరశ్మి, తిమిరంబును బలె = చీఁకటిని బలె, అజ్ఞతనెల్లన్ అజ్ఞానంబునంతయును, అవగతి=జ్ఞానము, నిహతంబొనర్చున్= నశించినదానినిగాఁ జేయును.

తా. అజ్ఞానము ప్రకృతి లోకము ప్రకృతినుండి యేర్పడినది కర్మములు లోకమునం దిమిడియున్నది. జన్యజనకభావంబునం జేసి కర్మంబులకును అజ్ఞానంబునకును భేదముండదు గదా? కాఁబట్టి కర్మవల్ల నజ్ఞాన బు నశింపదు. జ్ఞానంబు స్వయంజ్యోతిస్స్వరూపంబయినది. కాఁబట్టిసూర్యరశ్మి చీఁకటిం బాఁపిన వితంబున జ్ఞానం బజ్ఞానఁబుం బోఁగొట్టఁగలదు. ఇందు ఉపమాలం. కారము ఉపయోగింపఁబడినది.

అవతారిక. ఆత్మ యొక్కొక్క శరీరంబునందును భిన్నుండుగా నుండును గదా! అతం డెట్లొక్కండగును ?

శ్లో॥ అవిచ్ఛిన్న ఇవాజ్ఞానా త్తు, న్నాశే సతి కేవలః ।
స్వయంప్రకాశతే హ్యాత్మా, మేఘాపాయేఽంశుమా నివ ॥

కం॥ పరమాత్ముఁడు భిన్నుండగు ।
కరణి నవిద్యావరణునఁ నృపడు నదియున్ ।
దెరలిన నీరదనిర్గత ।
తరణిక్రియన్ వెలుఁగు దనకుఁ దానెక్కటిస్తై

టీక. అవిద్యాభరముఁ = అజ్ఞానముయొక్క మోఁత వలన, పరమాత్ముఁడు, భిన్నుఁడు = వేఱయినవాఁడు, అగు కరణిఁ = అయినరీతిని, కన్పడుఁ (ను), అదియుఁ = ఆయ జ్ఞానంబు, తెరలిఁ = చెదరినచో, నీరదనిర్గత తరణిక్రియఁ = మేఘంబులనుండి వెల్వడిన సూర్యునివలె, తనరుఁ, తాను, ఎక్కటియై = ఒక్కఁడే యయినవాఁడై, వెలుఁగుఁ = ప్రకాశించును.

తా. అనేకంబులయిన శరీరంబులయొక్క యధ్యాసంబునంజేసి యాత్మభిన్నంబుగాఁ గన్పట్టుచున్నవి. ఆ శరీరంబులజ్ఞానంబున నేర్పడ్డవి. ఆయజ్ఞానంబు తొలఁగింపఁబడినచో నివేదనంబునంజేసి ఆత్మయొక్కఁడుగానే - ఏ రీతిగా మేఘావరణంబు తొలంగినచో సూర్యుండు ప్రకాశించునో ఆ రీతిగానే = ప్రకాశింపఁగలఁడు. (ఉపమానాలంకారము).

అవతారిక. ఆత్మయొక్కండే యనుచున్నారు. ఆత్మను తెలిసికొనుటకుఁగాను జ్ఞానంబను సాధనంబొకటియుపయోగింపఁబడుచున్నదిగదా ? అప్పుడు ఆయాత్మయును ఈ తెల్వియును వెరసి రెండువస్తువులు కాలేదా ? దానంజేసి ఆత్మకద్వితీయత్వంబుగల్గుట యెట్లు ? అన్నప్పుడు.

శ్లో॥ అజ్ఞానకలుషం జీవం, జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్॥
కృత్వా జ్ఞానం స్వయం నశ్యే, జ్జలం కతక రేణువత్ ॥

కం॥ తనుఁగూర్చిన యభ్యసన ।
మ్మునఁ జిత్తజ్ఞాన మలినపురుషునిఁజొక్కం ।
బొనరిచి నీళులమక్క ।
ల్లన్న దొలఁచెడు నిందుగు క్రియలయమగు దానుఁ ॥

టీక. నీళులఁ = జలములయందలి, మక్కు ఎల్లను = మయిలనంతయును, తొలఁచెడు = పోఁగొట్టునట్టి. ఇందుగు క్రియఁ = చిల్లగింజెరీతిగా, చిత్తు = జ్ఞానము, అజ్ఞానమలిన పురుషునిఁ = అజ్ఞానంబునంజేసి కలఁకఁజెందిన మనుజునిని, తనుఁగూర్చిన = ఆత్మనుగూర్చిన, అభ్యాసనంబునఁ = అభ్యాసంబునందు, చొక్కంబొనరిచి = చొక్కునట్లు చేసి, తానును (అందు = అనఁగా ఆయాత్మయందు), లయము అగును = కలసిపోవును, తాదాత్మ్యంబును జెందును.

తెల్వి లేమింజేసి యేర్పడిన యహంకారము మమకారము మొదలయిన వానిచేత జీవునికి కర్తృత్వము అను భోక్తృత్వంబు మొదలయిన యభిమానంబు లుండును. జ్ఞానంబు అభ్యాసంబునఁజేసి జీవునియందుఁ గల యజ్ఞానంబును (ఏరీతిగాఁ జిల్లగింజ గంధము (అరుగఁదీసినది) వండు, నీటిని తేఁటపఱచి తానును ఆ నీటిలోఁ గలిసిపోవునో ఆరీతిగానే) పోఁగొట్టి పరిశుద్ధుంజేసి తానును అందే కలియును.

అవతారిక. ప్రత్యక్షంబుగా నందఱిచేతను చేయఁబడుచున్న యీసంసారంబు నసత్తని యెట్లనుటకు వీలగును. అనునట్టి ప్రశ్నకు శ్రీమదాచార్యులవారు కల యను దృష్టాంతంబు జూపి యీ సంసారంబుయొక్క యసద్భావంబుఁ దెలియబఱచుచున్నారు.

శ్లో. సంసార స్స్వప్నతుల్యోహి, రాగ ద్వేషాదిసంకులః ।
స్వకాలే సత్యవద్భాతి, ప్రబోధేఽసత్యవద్భవేత్ ॥

కం. పగవలపులు మున్నగునవి ।
బుగులుకొనఁగ సంసృతి గల పొల్పననిజమై ।

యగపడుఁ డా నెగడుతఱిని ।

నగు నసృతం బది ప్రబోధ మందిన పిదపన్ ॥ 6

టీక. కలపొల్పునన్ = స్వప్నరీతిగా, పగవలపులు = విరోధము రాగము మున్నగునవి, బుగులుకొనఁగా=సందడింపఁగా, సంసృతి = సంసారము, తాను, నెగడుతఱిని = జరుగు సమయంబునందు, నిజమై = నిక్కంబయినట్లు, అగపడున్ (ను), ప్రబోధము = మేలుకువను (జ్ఞానమును), అందిన పిదపన్ = పిమ్మట, అది = ఆ సంసారము, అనృతంబు = అసత్యము, (అగును)

తా. ఏ రీతిగా కల నిద్రావస్థయందు తాను మిక్కిలియబద్ధంబయిన దయినప్పటికిని నిజంబయినదాని పోల్కినే కానవచ్చి యా నిద్రనుండి మేలుకువ కల్గిన పిమ్మటను మిక్కిలి అబద్ధంబయినట్లు తెలియఁబడుచున్నదో ఆరీతిగానే తనకుఁ గారణంబయిన యజ్ఞానావస్థయం దుండువఱకును సంసారము నిజంబయినదిగానే తోఁచును. కాని జ్ఞానం బేర్పడిన పిమ్మట నయ్యది యసత్యంబగును, (ఉపమానాలంకారము.)

అవతారిక. "జగన్మిథ్యా" యనుటకు మఱి యొక యుదాహరణంబు:—

శ్లో॥ తావత్సత్యం జగద్భాతి, శుక్తికా రజతంతథా ।
యావ న్నజ్ఞాయతే బ్రహ్మ, సర్వాధిష్ఠానమద్వయమ్ ॥

క॥ ఏవఱ కఖిలాలంబక ।
కేవల పరమాత్మ బుద్ధిఁ గీల్కొనఁబడఁడో ।
యావఱకు జగము శుక్తిని ।
దైవాఱెడు వెండివోలెఁ దనరు నిజంబై ॥ 7

టీక. ఏవఱకుఁ = ఎందాఁకను, అఖిల+ఆలంబక = సమస్తంబునకు ఆధారభూతుండయిన, కేవలపరమాత్మ = ఒక్కఁడయిన పరమాత్మునందు, బుద్ధిః = బుద్ధియందు, కీల్కొనఁబడఁడో = తగుల్కొనఁ జేయఁబడఁడో, ఆవఱకుఁ = అందాఁకను, శుక్తిని = ముత్యపుఁ జిప్పయందు, దైవాతేడు = ఉండునట్టి, వెండిభ్రాలెః = వెండి (యను భ్రాంతి) వలె, జగము = లోకము, నిజంబై తనరుఁ = కనబడును.

తా. ముత్తెపుఁజిప్ప ముత్తెపుఁజిప్ప యని తెలియు నంతవఱకును దాని యందు వెండియను భ్రాంతి యుండును గదా ? ఆ రీతిగానే సమస్త ప్రపంచంబునకు గారణంబును ఏకంబును అయిన బ్రహ్మంబు తెలియఁబడ నంతవఱకును అందాఁకను ఈ లోకంబు సత్యంబయినదిగానే తోచుచుండును.

అవతారిక. మనకుం గానవచ్చునట్టి యీ ప్రపంచం బంతయును పరమాత్మునియందే సృష్టిస్థితి వినాశంబుల నొందునని శ్రీవారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ సచ్చిదాత్మన్యనుస్యూతే, నిత్యేవిష్ణౌప్రకల్పితాః ।
వ్యక్తయో వివిధా స్సర్వా, హాటకే కటకాదివత్ ॥

క॥ స్థిరముననుస్యూత మఖిల ।
భరితము సచ్చిన్మయమగు బ్రహ్మంబునఁ గూ ।
ర్తురు వివిధత్వంబును బం ।
గరునం గటకాద్యనేక కల్పనము క్రియఁ ॥ (8)

టీక. స్థిరమును = శాశ్వతంబయినదియును, అనుస్యూతము = అన్నిటను నుండునదియును, అఖిలభరితముఁ =

అన్నింటను నిండుకొని యుండునదియును, సత్ + చిత్ + మయము+అగు=సచ్చిదానందస్వరూపం బయినదియును నయిన బ్రహ్మంబునన్ = పరమాత్మయందు. బంగరువునన్ = బంగారమునందు, కటక+ఆది+అనేకకల్పనము క్రియన్=కడియంబులు మున్నగు ననేకంబుల నేర్పాటుచేయురీతిగా, వివిధత్వంబును= అనేకవిధంబులు అను భావంబును, కూర్తురు=కల్పింతురు.

తా. శాశ్వతంబును సచ్చిదానందస్వరూపంబును సర్వవ్యాపకంబునునై యున్న పరమాత్మయందు స్థావరజంగమంబులు మనుష్యులు జంతువులు దేవతలు మొదలయిన యనేకవిధంబులయిన స్వరూపంబులు ఒక్కటేయయి బంగారమందు హారకేయూర కటకాద్యాభరణంబులు అనేకవిధంబు లయినవి కల్పింపఁబడినట్లు కల్పింపఁబడినవి. అయినను ఏరీతిగా ఆ కల్పింపఁబడిన కడియములు మొదలయిన యాభరణంబు లా బంగారు కన్న "సువర్ణమేకం బహుభూషణాని" అను నీతి ప్రకారము వేఱుకావో ఆరీతిగానే - పరమాత్మయందేర్పాటుగావింపఁబడిన యీలోకంబు లన్నియును పరమాత్మ కన్నను వేఱయినవి గావు. (ఉపమానాలంకారము.)

అవతారిక. ఈకానవచ్చు లోకంబంతయును బ్రహ్మంబునం దవిద్య గావించినకల్పనంబే యని శ్రీమదాచార్యుల వారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ ఉపాదానేఽఖిలాధారే, జగన్తి పరమేశ్వరే ।
సర్గస్థితిలయాన్ యాన్తి, బుద్బుదా నీవ వారిణి ॥

క॥ ఆదరు వంతకును మఱి యు ।
పాదానమునై తలిర్చు బ్రహ్మంబుననం ।

బూదిత బుద్బుదముల క్రియఁ ।

ప్రాదుర్భావస్థితి లయ వశమగు జగముల్ ॥ 9

టీక. అంతకును, ఆదరువు = ఆధారంబును, మఱి = అంతేకాక, ఉపాదానంబును = కారణంబును, ఐ, తలిర్చు = ఒప్పునట్టి, బ్రహ్మంబునన్ = పరమాత్మునియందు, అంబు+ఉదిత = నీటియందుఁ బుట్టిన, బుద్బుదములక్రియన్ = బుడగలరీతిగా, జగముల్ = లోకంబులు, ప్రాదుర్భావస్థితి లయ వశము + అగున్=సృష్టి స్థితి లయములకు లోబడుటయాగును.

తా. ఏరీతిగా జలంబునందుఁ బొడమిన బుడగలు నీటిలోనేపుట్టి అందే పెరిగి యందే వినాశంబును జెందునో ఆరీతిగా అన్నింటికిని గారణంబును అన్నింటికిని ఆధారభూతుండును అయిన పరమాత్మునియందు సమస్తంబయిన (అనఁగా కోటులకొలఁది బ్రహ్మాండంబులు) లోకంబులు పుట్టుట పెరుగుట గిట్టుట యేర్పడును. ఇయ్యావస్థలే చెందిన నీటిబుడగలు నీటికన్న వేఱుకానట్లు ఈలోకంబులు బరమాత్మునికన్నను వేఱు కాజాలవు. (ఉపమానాలంకారము.)

అవతారిక. పయిని యభిప్రాయంబే గగనోదాహరణంబుచేఁ దెల్పఁబడుచున్నది.

శ్లో॥ యథాకాశో హృషీకేశో, నానోపాధి గతో విభుః ।

తద్భేదాద్భిన్నవద్భాతి, తన్నాశే కేవలోభవేత్ ॥

క॥ పలుతెగల యుపాధుల నది ।

విలీలనెనయుచు విభుండు విష్ణుయేశుఁడు దా ।

నలభేదములను వేఱగుఁ ।

బలిరుచుఁ గేవలుఁడయి యవి దలఁగినయంతన్ । 10

టీక. విషయేశుఁడు = హృషీక + ఈశుఁడు = ఇంద్రియాదుల కధీశ్వరుఁడు. (ఈయర్థములో అకే విషయేశశబ్దంబు పయోగింపఁబడినది,) (అయిన,) విభుః = ప్రభువు = పరమాత్ముండు, పలుతెగల = అనేకవిధంబులయిన, ఉపాధులన = శరీరంబులయందు, దివిలీలన్ = ఆకాశమురీతిని, ఎనయుచున్ = పొందుచు, అల భేదములను=ఆశరీరంబుల యొక్క భేదంబులంజేసి, వేఱగున్ = ప్రత్యేకరీతిగాఁ గన్పట్టును, అవి = ఆశరీరంబులు, తలఁగినయంతన్ = పోయిన పిదపను. కేవలుఁడు x అయి = ఒక్కఁడేయయి, తలిరుచున్ = ప్రకాశించును. (ఉపమానా లంకారము.)

తా. ఆకాశంబొకటె యయినప్పటికిని మఠముఘటము మొదలయిన భిన్నోపాధులంజేసి అనేక విధంబులుగా గనుపడుచున్నది. ఆయుపాధులు లయమొందినచో అఖండాకాశమేయగును. అలాగుననే మనస్సు మొదలయిన సమస్తేంద్రియంబులను నియమించువాఁడును సర్వవ్యాపియును అయిన పరమాత్ముఁడు మాయాకల్పితానేకవిధశరీరములలోఁ ప్రతిబింబించి నప్పుడనేక జీవులుగాఁగనుపట్టును. బ్రహ్మాత్మైక్యపుం దెల్విచేత మాయాకల్పిత దేహాలయంబేర్పడినప్పుడు పరమాత్ముఁ డఖండుఁడుగాఁ గనుపించును.

అవతారిక. ఎన్నో శరీరంబులలోను జాతులలోను తేర్పఁబడిన పరమాత్ముండు శాశ్వతంబుగా స్వేచ్ఛగలవాఁడనుట కేరీతిగా వీలగునో అచార్యుల వారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ నానోపాధివశాదేవ, జాతి నామాశ్రమాదయః ।
ఆత్మన్యారోపి తాస్తోయే, రసవర్ణాది భేదవత్ ॥

క॥ అభిధానా శ్రమజాతి ।
ప్రభృతులు బ్రహ్మమున మోపఁబడువివిధోపా ।
ద్యభివశుఁ డగుటన వర్ణర ।
సభేదములు నీట మోపు చాడ్పునఁ దలఁపన్ ॥ 11.

టీక:—తలఁపన్ = ఆలోచింపఁగా అతఁడు = పరమాత్మఁడు), వివిధ + ఉపాధి + అభివశుఁడు = అనేకవిధంబులయిన శరీరంబులను జెందినవాఁడు, అగుటన = అగుటం జేసియే, బ్రహ్మమునన్ = (ఆ) పరమాత్మునియందు, అభిధాన + ఆశ్రమ = జాతి ప్రభృతులు = పేరులు ఆశ్రమములు జాతులు మొదలయినవి, వర్ణరసభేదములు = వన్నెలు రసములు అను భేదంబులు, నీటన్ = నీటియందు, మోఁపు చోడ్పునన్ = మోఁపఁబడురీతిగా, మోఁపఁబడున్ = ఆరోపింపఁబడును.

తా. రుచియును వన్నెయును లేని నీటియందు రుచులును వన్నెలునుగల వస్తువులయొక్క కలయికం జేసి రుచులును రంగులును వర్పడిన ఆరసవర్ణంబుల యారోపణం బా నీటికిగల్గినట్లు పరమాత్ముండు నానా విధంబులయిన శరీరంబులం జెందుటంజేసి పేరులను ఆశ్రమంబులను జాతులను జెందినట్లారోపింపఁబడును. ఇదంతయు నజ్ఞానంబుచేత నేర్పరుపఁబడిన దగునుకాని నిర్యాది సత్యంబుకాదు.

అవతారిక. ఆత్మకు మూఁడు శరీరంబులున్నట్లు అజ్ఞానంబుచేతఁ గల్పింపఁబడినదని చెప్పఁబడు చున్నది.

* శ్లో॥ పంచీకృత మహాభూత, సంభవం కర్మసంచితమ్ ।
శరీరంసుఖదుఃఖానాం, భోగాయతన ముచ్యతే ॥

కం॥ పంచమహా భూతక్రమ ।
పంచీకరణోద్భవంబు బహుకర్మఘటా ।
సంచితమగుదేహముఁ గీ ।
మంచుఁబలుకఁబడు సుఖంబు నార్తియుఁ గుడువన్ ॥ 12

టీక. పంచమహా భూత = అయిదు మహా భూతంబులయిన పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులను క్రమ=వరుసగా ఒక్కొక్కదానిని, పంచీకరణ = అయిదు విధములుగా చేయుటనుండి, ఉద్భవంబు = పుట్టినది, బహుకర్మ ఘటాసంచితము + అగు = అనేకకర్మంబుల సమూహంబుల జేర్పు గలదియగు (ఆగామిసంచిత ప్రారబ్ధ కర్మంబులచేత నేర్పాటు చేయఁబడినది యయిన), దేహంబు, సుఖంబును, ఆర్తియున్ =దుఃఖంబును, కుడువన్ = అనుభవించుటకు, గీము + అంచున్ = అని, పలుకఁబడును = చెప్పఁబడుచున్నది.

తా. కర్మంబులకు అద్భుతంబయిన శక్తియున్నది. దానంజేసి యీశరీరంబు పంచమహా భూతంబులయిన పృథివ్యప్తేజోవాయ్వాకాశంబుల యొక్క పరస్పరంబుల కలయికలంజేసి యేర్పడిన మంచిచెడ్డలను జరగించు చోటుగానుండునట్టి యింటింబలె సుఖదుఃఖంబులను జెందుస్థలంబుగానొప్పెడిని.

---

* (పంచీకరణ వివరణము గ్రంథాంతంబునఁ జేర్పఁబడినది.)

శ్లో॥ పంచప్రాణమనో బుద్ధి, దశేన్ద్రియసమన్వితమ్ ।
అపఞ్చీకృత భూతోత్థం, సూక్ష్మాంగ భోగసాధనమ్ ॥

క॥ మానసధిషణాపంచ ।
ప్రాణేంద్రియదశకయుత మపంచీకృతభూ ।
తానీకసముత్పన్నం ।
బౌనల్పాంగముగుడుపునకగుసాధనముౘ ॥ 13

టీక. మానస = (నిశ్చయములేని) మనస్సు, ధిషణా = (నిశ్చయముకలది) బుద్ధి, పంచప్రాణ = ప్రాణాపానవ్యానోదానసమానము లయిదిటితోనొప్ప ప్రాణమను (ఊపిరి,) ఇంద్రియదశక = జ్ఞానేంద్రియములు త్వక్చక్షు రాదులును కర్మేంద్రియము వాక్పాణ్యాదులును పది, (ఈయన్నిటితో) యుతము = కూడినది, అపంచీకృత = పంచీకరణము చేయఁబడని భూతముల యొక్క సమూహముచేత, సముత్పన్నాం = ఏర్పడినది, బౌ = అయిన, అల్ప + అంగము = సూక్ష్మంబయిన శరీరము, కుడుపునకుౘ = సుఖదుఃఖానుభవంబునకు, సాధనము అగును.

తా. ఆత్మంలో లేనట్టి సుఖమును దుఃఖమును ఉన్నవాని వలెనే కనుపఱచుటకుఁగాను పంచప్రాణ పంచజ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియములతోను మనో బుద్ధులతోడను జేరియుండు సూక్ష్మదేహంబు సుఖ దుఃఖంబులను భవించును.

అవతారిక. స్థూలసూక్ష్మదేహంబులు రెంటికిని ఆధారంబయిన కారణదేహము.

శ్లో॥ అనాద్యవిద్యానిర్వాచ్యా, కారణోపాధి రుచ్యతే ।
ఉపాధిత్రితయాదన్య, మాత్మానమవధారయేత్ ॥

క॥ నుడులకుఁ జొప్పడనిది మొద ।
లుడిగినది యవిద్య కారణోపాధి యనం ।
గడలుకొను మూఁ డుపాధుల ।
కెడయగునది బ్రహ్మ మనుచు నెన్నంగఁదగున్ ॥ 14

టీక. నుడులకున్ = మాటలతో జెప్పుటకు, చొప్పడనిది = వీల్గానిది, మొదలు + ఉడిగినది = ఆదిలేనిది, (అయిన) అవిద్య = మాయ, కారణ + ఉపాధి = స్థూల సూక్ష్మంబులకుఁగారణంబయిన యుపాధి, అనన్ = అనునట్లుగా, కడలుకొనున్=ఏర్పడును. ఈమూఁడు (స్థూలసూక్ష్మ కారణములు అనెడి) ఉపాధులకు. ఎడయగునది = దవ్వయినది, బ్రహ్మము = పరమాత్మ, అనుచు = అని, ఎన్నఁగఁదగున్ = చెప్పనగును.

తా. పూలలోని పరిమళము అగ్నిలోని తేజోదాహకత్వములు మొదలయిన గుణములు ఆవస్తువులన్నియును వానికంటెఁ బ్రత్యేకంబయిన వనియును జెప్పుటకునేరీతిగా వీలులేదో ఆరీతిగానే మాయారూపంబయిన అవిద్య యుపాధియును చిన్మాత్రరూపంబయిన యాత్మకన్నను బ్రత్యేకంబగు ననియును కాదనియును వచించుటకు వీలులేదు. కాఁబట్టి దానినివివరించి చెప్పుటకు వీలులేదని వచియించినపిమ్మటను ఉపాధిరూపంబులుగా నున్న స్థూలసూక్ష్మ కారణదేహంబుల కన్నను తాను ప్రత్యేకమగునట్లు ఆత్మనెఱుంగవలయును.

అవతారిక. అయిదు కోశములలో నుండు ఆత్మకు పరిశుద్ధియును ముక్తియును ఒప్పు రీతి దృష్టాంతీకరింపఁ బడుచున్నది.

శ్లో॥ పఞ్చకోశాదియోగేన, తత్తన్మయఇవస్థితః ।
శుద్ధాత్మా నీలవస్త్రాది, యోగేనస్ఫటికో యథా ॥

క॥ పరిశుభ్రాత్ముఁడు కోశము ।
లరపది మొదలయిన వెనసి యాయారూపుల్ ।
పొరసినటు వెలుఁగు నీలాం ।
బరాదిసంగతిని బొల్చుస్ఫటికముమాడ్కిన్ ॥ 15

టీక. నీల + అంబర + ఆదిసంగతిని = నల్లవస్త్రము మొదలయిన వానియొక్క (అనగా ఇంకను ఎఱ్ఱనివస్త్రము ఆఁకుపచ్చని వస్త్రము మొదలయిన రంగులబట్టల యొక్క) చేరికవలన, పొల్చు = ఒప్పునట్టి, స్ఫటికము (యొక్క) మాడ్కిన్ = రీతిగా, పరిశుభ్ర = ఆత్ముఁడు = పరిశుద్ధంబయిన యాత్మ (పరమాత్మ) కోశములు అరపది = అయిదు కోశములు (అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము అనునవి) మొదలయినవి = మొదలయిన వానిని (షడూర్ములు = షట్ + ఊర్ములు = అనఁగా = ఆకలిదప్పి దుఃఖము మోహము ముసలితనము చావులనునవి) ఎనసి = చెంది, ఆయారూపుల్ (లు), పొరసినటు = చెందినట్లు, వెలుఁగున్ = ప్రకాశించును (ఉపమానాలంకారము.)

అవతారిక. ముముక్షువులు ఆత్మ దేనితోను సంబంధము లేనిది అని తెలిసి కొనుపాంకు ఈదిగువ దెల్పఁబడియెడిని.

శ్లో॥ వపుస్తుషాదిభిఃకోశై, ర్యుక్తంయుక్త్యవఘాతతః ।
ఆత్మానమన్తరం శుద్ధం వివి చ్యాత్తండులంయథా ॥

క॥ కేవలుని నంతరాత్ముని ।
బావనుఁ దుషతండుల పరిభాగముక్రియఁగో ।
శావృతదేహము నకుతే ।
తై విన్ననువునవొనర్చియరయంగఁదగుక్ ॥ 16

టీక. తుషతండుల పరిభాగము క్రియన్ = పొట్టును బియ్యమును వేఱుచేసినరీతిగా, కోశ + ఆ వృత దేహము నకున్ = అన్నమయము మొదలయిన కోశంబులకు, కేవలునిన్ = ఎక్కటియైను, పవనున్ = పరిశుద్ధుఁడును, అయిన అంతరాత్ముని, విన్ననువునన్ = మంచినేర్పుతో, వేఱై యొనర్చి = వేఱగునట్లుగా, అరయంగఁదగున్ = పరిశీలింప వలయును.

తా. మనుష్యులు వడ్లనుండి బియ్యమును చెందుట పొంటెను దంచుటంజేసి దాని తవుడుపొట్టు మొదలగు దానిని దానినుండి ప్రత్యేకపఱచి కైకొనురీతిగానే పంచకోశంబుల వలెఁగనుపట్టునట్టి యాత్మను శ్రవణంబు మననంబు నిదిధ్యాసము అనువానిచేతఁ బరిశీలనగావించి పేరులును రూపంబులునుగల్గిన యీ యుపాధు లన్నియును మిథ్యయును అసత్యంబును అగునుగాఁబట్టి వీనికన్నఁ బరుండును సచ్చిదానంద

స్వరూపుండును శుద్ధుండును అయినయాత్మ తానుగా నెఱుంగవలయును. (ఉపమానాలంకారము.)

అవతారిక. ఆత్మ సర్వత్ర వ్యాపించువాఁడయినచో నెందులకుఁగనుపడ డన్నందులకుఁ సమాధానంబు:—

శ్లో॥ సదాసర్వగతోఽప్యాత్మా, న సర్వత్రావభావతే ।
బుద్ధావేవావభాసేత, స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥

కం॥ అనయము సర్వగతుండ ।
య్యునునాత్ముం డెటఁ బ్రకాశ మొందఁడుమఱి బు ।
ద్ధినిమాత్రఁ దేజరిల్లును ।
వినిర్మలపదార్థఫలిత బింబములీలన్ ॥ 17

టీ. ఆత్ముండు = ఆత్మ, అనయము = ఎల్లప్పుడును, సర్వగతుండు + అయ్యును = అంతటను నుండు వాఁడయినప్పటికిని, ఎటన్ = ఎక్కడెక్కడను, ప్రకాశ మొందఁడు, మఱి = కాని, వినిర్మల పదార్థఫలిత బింబములీలన్ = దోసంగులేని పరిశుభ్రమయిన అద్దమునీరు మొదలయిన వస్తువునందుఁ బ్రతిఫలించిన ప్రతిబింబమువలె, బుద్ధినిమాత్ర = బుద్ధిలోమాత్రము, తేజరిల్లును.

తా. ఆకసము సర్వత్ర వ్యాప్తంబయ్యును రూపము లేనిది. అయినను అయ్యాదినీరు అద్దము మొదలయిన నిర్మల వస్తువులలోఁ బ్రతి ఫలించెడిని. ఆరీతిగా సర్వదా వ్యాపించియుండు పరమాత్ముండు రూపములేని వాఁడయినను రాగద్వేషములు మొదలయిన మయిలలేని బుద్ధికిఁ దేటగాఁగానవచ్చును.

(ఉపమానాలంకారము.)

అవతారిక. శరీరంబునందుండునట్టి యాత్మకు ఔదాసీన్యం బెట్లు కల్గునన్నపుడు రాజపురుషోదాహరణంబుతో దానికి సమాధానము వచియించుచున్నారు.

శ్లో॥ దేహేంద్రియ మనోబుద్ధి, ప్రకృతిభ్యో విలక్షణమ్ ।
తద్వృత్తిసాక్షిణం విద్యా, దాత్మానం రాజవత్సదా ॥

కం॥ తనుకరణ మనశ్చేతన ।
లనెడు ప్రకృతి సర్గమునకు నన్యుఁడుఁ దద్వ ।
ర్తనముల ద్రష్టయు నగు నా ।
త్మని రాజనిభుం డని తలఁపోయఁగవలయున్ ॥ 18

టీక. తను=శరీరము, కరణ=ఇంద్రియములు 10- జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు, మనః + చేతనలు - మనస్సును బుద్ధియును, అనెడు ప్రకృతివర్గమునకు, అన్యుఁడు = పరుఁడును, తద్వర్తనముల = ఆపనులయొక్క, ద్రష్టయున్ = సంబంధము లేనివాఁడై చూచువాఁడగు, ఆత్మనిన్=పరమాత్మనిని, రాజనిభుండు=రాజుతో సమానుఁడు, అని, తలపోయఁగ వలయున్ = తలంపవలయును.

తా. రాజు నానతింజేసి సేవకులు తమతమ నియుక్తకార్యంబులను గావించుచుండునప్పుడా రాజు వారికార్యంబులకు సంబంధింపక చూచుచుండు రీతిగా శరీరము ఇంద్రియంబులు మనస్సు మొదలయినవి ఆయాత్మయొక్క సాన్నిధ్యంబునం

జేసి వ్యాప్తిం జెందుచుండినను ఆయాత్మవానితో సంబంధంబుఁ జెందక సాక్షియై కాంచుచుండును.

(ఉపమానాలంకారము.)

అవతారిక. కాని ఆత్మకు ఎప్పుడును ఇంద్రియంబుల యొక్క వ్యాపారం బుండినట్లే తోఁచెడిని. అట్టి యాత్మకు వికారంబు లేదనుట కెట్లు వీలగునను ప్రశ్నకు జగద్గురువుల వారు సమాధానంబు వచియించుచున్నారు.

శ్లో॥ వ్యాపృతే ష్వింద్రియేష్వాత్మా, వ్యాపారీవా వివేకినామ్ ।
దృశ్యతేఽభ్రేషు ధావత్సు,ధావన్నివ యథాశశీ ॥

కం॥ అవివేకు లింద్రియచయం
బవఘళమగుచుండ నాత్మ వ్యాపారి యటం ।
చు విలోకింతురు మొయిలు ప ।
రువిడఁగ శశి పాఱు నంచు రూపించు రహిన్ ॥ 19

టీక. ఇంద్రియచయంబు = కనులు ముక్కు మొదల యిన యింద్రియంబులు, అవఘళమగుచుండఁగన్ = వ్యాపృతింజెందుచుండఁగా, అవివేకులు=ఎఱుక లేనివారు, మొయిలు= మేఘము, పరుగిడఁగన్ = పరుగెత్తఁగా, శశి = చంద్రుఁడు. పాఱును, అంచున్=అని, రూపించు రహిన్ = నిర్ణయించు రీతిగా, ఆత్మన్=ఆత్మను, వ్యాపారి = వ్యాపృతి గల వాఁడు, అఁటంచున్ = అని, విలోకింతురు = తలంతురు.

తా. చంద్రుని కడ్డంబుగా మేఘంబు లాకసంబునఁ బాఱునప్పుడు చంద్రుఁడు పరుగెత్తుచున్నాఁడని తలఁపఁ బడి

నట్లు ఎఱుక లేని వారికి ఆత్మతోఁ జేరిన శరీరము ఇంద్రియంబులు మొదలయిన యుపాధులు తమ వ్యాపృతుల నాత్మయందుఁ గనుపడునట్లు చేయుటం జేసి, యెఱుక లేని వారా సత్యంబు గాంచేక యాత్మకు వ్యాపారంబున్నట్లు తలంతురు.

(ఉపమానాలంకారము.)

అవతారిక. దేహంబును ఇంద్రియంబులును మనస్సును బుద్ధియును ఆత్మవలెనే యెందుకుఁ గనుపట్టుచున్నవను ననుమానమునకు సమాధానము.

శ్లో॥ ఆత్మచైతన్య మాశ్రిత్య, దేహేంద్రియ మనోధియః ।
స్వకీయార్థేషు వర్తంతే, సూర్యాలోకం యథా జనాః ॥

క॥ తనుచిన్మానస విషయము
లను వర్తించును దమతమ యర్థంబులనా ।
త్మని చైతన్యము ప్రాపున ।
జనులిన చైతన్యమహిమఁ జరియించు క్రియన్ ॥ 20

టీక. జనులు, ఇన చైతన్యమహిమన్ = సూర్యకాంతి యొక్క మహిమం జేసి, తమతమ, అర్థంబులన్ = విషయంబులయందు, చరియించుక్రియన్ = ప్రవర్తించునట్లు, తను ... విషయములు - తను = శరీరము, చిత్ = బుద్ధి, మానస = మనస్సు, (అను వానియొక్క) విషయములు, ఆత్మని (యొక్క), చైతన్యము (యొక్క), ప్రాపునన్ = పొందికవలనను, అనువర్తించును = పోలును.

తా. సూర్యకాంతివలన జనులేరీతిగాఁ జైతన్యమునొందు దురో ఆరీతిగానే దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి ఆత్మతేజంబునంజేసియే తెల్వి నందునుగాని జడంబులయిన యాదేహేంద్రియంబులు మొదలయినవానికిఁ దెల్వి లేదు.

(ఈ శ్లోకమునకే వ్రతియొక పద్యము)

క॥ జనులెటు రవిరశ్మి నట్లుఁ ।
మన ఇంద్రియతనుమతులుఁ దనర్చుఁ బరమా ।
త్మని చైతన్యపు టాదరు ।
వును గొనియుఁ దమతమ విషయపుంజమునందుఁ ॥ 21

టీక. జనులు, రవిరశ్మిఁ = సూర్యప్రకాశమును, ఎటు = ఎట్లో, అటుఁ = అట్లు, మనః+ఇంద్రియ తను మతులుఁ = మనస్సును ఇంద్రియములును దేహమును బుద్ధియును, పరమాత్మని చైతన్యమును, ఆదరువును (గా), కొనియు, తమ తమ, విషయపుంజమునందుఁ = విషయముల సమూహము నందు, తనర్చుఁ = ప్రవర్తించును. (ఉపమానాలంకారము).

(వరా:—ఈపద్యముకర్త-దోమా వేంకటస్వామిగుప్త.)

అవతారిక. నేను జననంబొంది బాల్యాద్యవస్థలనుభవించుచు దాని నెఱుంగుచున్నానుగదా. ఈవికారంబుల నన్నింటిని జెందుచున్న యాత్మనిర్వికారుండని చెప్ప వీలగునా యనఁగా శ్రీవారందులకు సమాధానం బవునని సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ దేహేంద్రియగుణా న్కర్మాణ్యమలే సచ్చిదాత్మని ।
అధ్యస్యన్త్యవివేకేన, గగనే నీలతాదివత్ ॥

కం॥ కాయేంద్రియ గుణకర్మని ।
కాయము లెఱుఁగమిని మోపఁగాఁబడు విమలం ।
బై యెసఁగు సచ్చిదాత్మను ।
జాయలు నైల్యాదు లాకసమ్మునఁబోలెన్ ॥ 22

టీక. - ఆకసమ్మునన్ = ఆకాశంబునందు, నైల్య + ఆదులు = నలుపు మొదలయినవగు, చాయలుపోలెన్ = వన్నెలవలె, ఎఱుఁగమిని = తెలియక పోవుటచేత, కాయ + ఇంద్రియ గుణకర్మని కాయములు = దేహమును, కనులు ముక్కు మొదలుయిన యింద్రియంబులును సత్త్వాదిగుణంబులును సుకర్మదుష్కర్మలును అనువానియొక్క సమూహములు, విమలంబై = దోసంగులేనిదై, ఎసఁగు = ప్రకాశించునట్టి, సత్ + చిత్ + ఆత్మను = సచ్చిన్మయంబయిన పరమాత్మయందు, మోఁపఁగాఁ బడున్ = ఆరోపింపఁబడును.

తా. రూపంబుగాని అంగంబులుగాని లేని యాకసంబునందుఁ బిల్లవాండ్రు నీలత్వము మొదలయిన వన్నెలను ఆరోపించు రీతిగానే సచ్చిదానంద స్వరూపుండయిన పరమాత్మునియందుఁగూడ దేహంబు మొదలయిన సమస్తోపాధులును వానియొక్క వ్యాపారంబులును జ్ఞానంబు లేని కారణంబునంజేసి కనుపడుచున్నవే కాని నిజముగా విచారించిన యెడల ఆకసంబునందు రూపంబుగాని వన్నెగాని లేనట్లు

ఆత్మయందుఁగూడ వ్యాపారంబులు వాలుకొక్కయని మోక్షా పేక్షకునికిఁ దెలియవలసి యుండును.

అవతారిక. నేను చేయువాఁడను అనుభవించువాఁడను అను అనుభవము ఆత్మయందెల్లప్పుడు కనుపడుచుండఁగా ఆ కర్తృత్వంబును భోక్తృత్వంబును ఆత్మకు లేనేలేవని యేరీతిగాఁ జెప్పుటకు వీలగును అను ననుమానంబునకు- అయ్యవి యన్నియును ఆత్మయందుఁ గల్పితంబు లని శ్రీ జగద్గురువుల వారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ అజ్ఞానాన్మానసోపాధేః, కర్తృత్వాదీని చాత్మని ।
కల్ప్యన్తేఽమ్బుగతేచంద్రే, చలనాదియథాంభసః ॥

కం॥ మతి లేమి నాత్మ నారో ।
పితమగు మన మను నుపాధి విరచించు క్రియా ।
తతి జల చాపల్యముఁ ద ।
ద్గతమగు శశిబింబమందుఁ గల్పించురహిన్ ॥ 23

టీక. జలచాపల్యము = నీటియొక్క కదలిక, తద్గతమగు = దానియందుండు (ప్రతిఫలించు) నట్టి శశిబింబమందున్ = చంద్రునియొక్క రూపమునందు, కల్పించురహిన్ = ఆరోపించురీతిగా, మనము = మనస్సు, అను, ఉపాధి, విరచించు = చేయునట్టి, క్రియాతతి = కర్మముల సమూహము, మతిలేమిన్ = తెల్విలేకుండుటంజేసి, ఆత్మన్ = ఆత్మయందు, ఆరోపితము అగున్ = ఆరోపింపఁబడును.

తా. నీరు కదలినచో ఆనీటియందుఁ ఫలించిన చంద్రుని యొక్క బింబమునకుఁగూడ ఆకదలిక కనుపడునట్లే తెల్వి లేని కారణంబునం జేసి (నాఁకుఁ దెలియదు అను వ్యవహారంబునం జేసి నిశ్చయము గావింపఁబడిన తెల్వి లేమి యనునట్టి) మనస్సు అనెడి నుపాధిచేత చేయుటయును అనుభవించుటయును నను నవి యాత్మ కారోపింపఁబడి యుడిని. అంతేకాని నిక్కం బుగా విచారించిన యెడల కదలిక నీటికే కలదు కాని చంద్రునికి లేనట్లుగాఅత్మయందుఁ గూడ మనస్సుయొక్క కర్తృత్వ భోక్తృత్వంబులు లేవని తెల్లంబు.

అవతారిక. రాగము కోరిక సుఖము దుఃఖము మొదలయినవి ఆత్మయొక్క ధర్మంబులని వచియించునట్టి తార్కిక మతంబును జ్ఞానానుభవంబునం జేసి యొప్పుకొనరాదని వచియింపఁబడియెడిని,

శ్లో॥ రాగేచ్ఛా సుఖదుఃఖాది, బుద్ధౌ సత్యాం ప్రవర్తతే ।
సుషుప్తౌ నాస్తి తన్నాశే, తస్మాద్బుద్ధేస్తు నాత్మనః ॥

కం॥ ఎలమియు వగపును రాగే ।
చ్ఛలు బుద్ధి వెలుఁగ మెలఁగుచు స్వాపోద్ధతి బు ।
ద్ధి లయించుడుఁ దాము న లయ ।
ము లగుట నవి బుద్ధి ధర్మములుగ నెసంగున్ ॥ 24

టీక. బుద్ధి, వెలుగన్ = ఉండినప్పుడు (జాగ్రత్స్వప్నావస్థలయందు), ఎలమియున్ = సంతోసమును, వగపును = దుఃఖమును, రాగ + ఇచ్ఛలును = రాగమును కోరికయును

(మొదలయినవి అధ్యాహార్యము), మెలఁగుచున్ = ఉండుచు, స్వాప + ఉద్ధతిన్ = నిద్రయొక్క నిండుతనమునందు = సుషుప్తియందు, బుద్ధి, లయించుడున్ = లీనమయినప్పుడు, తాను లయము, అగుటను = అగుటచేత, అవి, బుద్ధి (యొక్క), ధర్మములుగన్, ఎసంగున్ = ఒప్పును.

తా. బుద్ధి పనిచేసినప్పుడే అనఁగా జాగ్రత్స్వప్నా వస్థలయందే రాగము కోరిక సుఖము దుఃఖము మొదలయినవి (ఆ బుద్ధియను కారణమునంజేసి) ఆత్మయందుఁ బ్రవర్తించును. కాని బుద్ధిలయమొందిన సుషుప్త్యవస్థయందు ఆ రాగము మొదలయినవి ఆత్మయందుఁ బ్రవర్తింపవు కనుక అవి బుద్ధియొక్క ధర్మములే కాని ఆత్మయొక్క ధర్మములు కావని తెలియవలయును.

అవతారిక. అట్లయినచో ఆత్మయొక్క కలరూపే మన్నందుకు సమాధానము. ✓

శ్లో॥ ప్రకాశోఽర్కస్య తోయస్య, శైత్యమగ్నేర్యథోష్ణతా।
స్వభావస్సచ్చిదానంద, నిత్యనిర్మలతాఽత్మనః ॥

కం॥ శైత్యముతోయంబులకా।
దిత్యునికి వెలుంగు శుచికిఁ దిగ్మము భంగిన్।
సత్యజ్ఞానానందత।
నిత్యపవిత్రత విభునికి నిజమై తనరున్ ॥ 25

టీక. తోయంబులకు = నీళ్లకు, శైత్యము = చల్లఁదనమును, ఆదిత్యునికిన్ = సూర్యునికి, వెలుంగున్ = వెలుతు

రును, శుచికిఁ = అగ్నికి. తిగ్మము = వేఁడిమియును, (అగు) భంగిఁ = రీతిగా, విభునికిఁ = ప్రభునికి = ఆత్మకు, సత్య జ్ఞానానందత = సచ్చిదానంద స్వభావమును, నిత్యపవిత్రత = ఎడతెగకయుండుట పరిశుద్ధత, నిజము + ఐ తగుఁ = స్వభావమగును.

తా. సూర్యునికి తేజస్సును నీటికిఁ జల్లఁదనమును అగ్నికి వేఁడిమియును స్వభావంబు లెట్లగునో ఆరీతిగానే సచ్చిదానందత్వమును ఎడతెగకయుండుటయును పవిత్రత యును ఆత్మకుఁ గలరూపని తెలిసికోఁదగును.

అవతారిక. ఆత్మ నిర్వికారము లేనిదయినప్పుడు నే నెఱుఁగుదునని యన వీలగునా ? అన్నందుకు సమాధానము.

శ్లో॥ ఆత్మనస్సచ్చిదంశశ్చ, బుద్ధేర్వృత్తిరితిద్వయమ్ ।
సంయోజ్య చావివేకేన జానామీతి ప్రవర్తతే ॥

కం॥ అక్షరుని సచ్చిదంశముఁ ।
ప్రేక్షావ్యాపారమునను నీరెండుఁదనూ ।
లక్షితుఁడు పొసఁగఁగూర్చుచు ।
వీక్షించెద నేనని యవివేకత మెలఁగుఁ ॥ 26

టీక. అక్షరుని = (చెడుటలేనివాఁడు) ఆత్మయొక్క, సత్ + చిత్ + అంశముఁ = సత్తుచిత్తుల యంశమును, ప్రేక్షా వ్యాపారము = చూపు (బుద్ధియొక్క) ప్రవర్తనమును (అను), ఈరెండుఁ (ను), తనూలక్షితుఁడు = దేహముచే గుఱుతింపఁ బడినవాఁడు (తెల్విలేనివాఁడు), పొసఁగఁ = చేరునట్లు

కూర్చుచుఁ = కలుపుచు, నేను, వీక్షించెదను = చూచెదను అని = అనునట్టి, అవివేకతఁ = తెల్వితేమితో, మెలఁగుఁ = ఒప్పును.

తా. జీవుఁడు ఆత్మయొక్క ప్రతిబింబము. దానిని దానికి అంతఃకరణరూపమయిన బుద్ధిప్రవర్తనను కలుపుకొని యవివేకియయిన వాఁడు నేను ఎఱుఁగుచున్నాను అని వ్యవహరించుచున్నాఁడు. కాని నిజముగా ఆలోచించినచో తాను తననుదప్ప నితరంబు నెఱుంగ వీలు లేఁదు. పయినిధర్మము ఆత్మకు సంపూర్ణనిద్రావస్థలయందు లేనందున ఆత్మ నిర్వికారుఁడు అని తెలియఁబడవలయును.

అవతారిక. పయిని అభిప్రాయంబే ధృఢపఱుపఁబడియెడిని.

శ్లో॥ ఆత్మనో విక్రియా నాస్తి, బుద్ధేర్బోధోన జాత్వపి।
జీవస్సర్వ మలం జ్ఞాత్వా, కర్తా ద్రష్టేతి ముహ్యతి॥

కం॥ అనఘాత్మను విక్రియ ప్ర।
జ్ఞను బోధము లేని వయ్యు సర్వముఁ దన్నై।
కనుఁగొని జీవుఁడు నే ద్ర।
ష్టను గర్త నటంచు మోహ సంకలితుఁ డగుఁ॥ 27

టీక. అనఘ + ఆత్మను = దోసము లేని ఆత్మయందు, విక్రియ = వికారమును, ప్రజ్ఞను = బుద్ధియందు, బోధముఁ = జ్ఞానమును, లేనివి అయ్యుఁ = అయినప్పటికిని, జీవుఁడు, సర్వమును, తన్నుఁ + ఐ = తానుగా, కనుఁగొని =

తలఁచి, నేను, ద్రష్టను = చూచువాఁడను, కర్తను = చేయువాఁడను, అనుచున్ = అని, మోహసంకలితుఁడు + అగున్ = తెలివిలేమితోఁ గూడినవాఁడు అగును.

తా. ఆత్మకు వికారం బనునదియును బుద్ధికి తెల్వియనునది యును లేకపోయినప్పటికిని ఆత్మయును నంతఃకరణంబును జేరుకొని యొకటిగాఁ గనుపడు జీవుఁడుగా నేర్పడినందున నేను చేయువాఁడను నేను చూచువాఁడను అను భ్రాంతిం జెందు చున్నాఁడే కాని నిజముగా విచారించిన యెడల ఈ చేయుట చూచుట అను ధర్మము లా యాత్మకు లేవని తెలిసికొన వలసినది.

అవతారిక. ఆత్మ తనకుఁదానే యితర ధర్మముల నారోపించుకొని సుఖదుఃఖానుభవముఁ జెందునట్లు చెప్పఁబడు చున్నది.

శ్లో॥ రజ్జు సర్పవదాత్మానం, జీవం జ్ఞాత్వా భయంవహేత్ ।
నాహంజీవః పరాత్మేతి, జ్ఞాతశ్చేన్నిర్భయోభవేత్ ॥

కం॥ త్రాడు భుజగ మ్మని జడియు ।
పోడిమి జీవుండనిపరమున్ భ్రమియుటచే ।
నోడు నరుఁడు జీవుం డే ।
వ్వాఁడగునే నాత్ముఁడ నన భయముక్తుఁడగున్ ॥ 28

టీక. నరుడు, త్రాఁడు. భుజగమ్ము = పాము, అని, జడియు పోడిమిన్ = భయముచెందురీతిగా, పరమున్ = పరమాత్మనిని, జీవుండు, అని, భ్రమియుటచేన్ = భ్రమియిం

చుటంచేసి, ఓమను = తలఁకును, జీవుండు, ఎవ్వాడు + అగునుని ఏను = నేను, ఆత్ముండను, అనఁ = అనిన యెడల, భయముక్తుఁడు = భయముచేత విడువఁబడిన వాఁడు, అగుఁ (ను).

తా. చీఁకటిలో సోఁకిన త్రాడు త్రాడని తెలియమిం జేసి దానియందు పాము భ్రాంతి యుదయించి భయమును వణఁకును గల్గునట్లు చేసిన రీతిగా, నిద్రావస్థలో పరిపూర్ణా ఖండానందరూపుఁడయిన యాత్మను జీవుండు అని తలంచినం దున యతండు సుఖదుఃఖముల ననుభవించునట్లును తోఁచేఁ బడుచున్నది. కాని అటుపిమ్మట సత్సాంగత్యాదులవలనను (వెలుతురు గల్గినప్పుడు త్రాడునందు తనకు ముందుండిన పాము భ్రాంతిపోయినట్లుగానే) జ్ఞానముకల్గి ఆత్మయందు జీవుండు అను భావము పోయి తాను పరమాత్ముఁడ నని యెఱుంగఁబడును.

అవతారిక. కడుంగడు దగ్గఱగా నుండు నట్టిబుద్ధి చిత్తము మనస్సు మొదలయిన యింద్రియములచేత ఆత్మ యెందులకు నెఱుంగఁబడఁడు అను ననుమానంబునకు సోదా హారణంబుగాఁ బ్రత్యుత్తరంబు వచియింపఁబడుచున్నది.

శ్లో॥ ఆత్మావభాసయత్యేకో, బుద్ధ్యాదీ నింద్రియాణ్యపి ।
దీపోఘటాదివత్స్వాత్మా, జడైస్తైర్నావభాస్యతే ॥

కం॥ పరమాత్ముఁడు కేవలుఁడై ।
కరణప్రజ్ఞాదికముల ఘటమును దీపం ।

బు రహిని దనుకంజేయును ।
స్వరుచినిదవ చేతనములఁ బడయఁ డొకప్డుణ్ ॥ 29

టీక. పరమాత్ముఁడు. కేవలుడు + ఐ = పరుఁడై, ఘటమును = కుండను. దీపంబును, (మొదలయినవానిని) వలె, కరణ ప్రజ్ఞా + ఆదికములణ్ = అంతఃకరణము బుద్ధి అహంకారము మనస్సు మొదలయినవానిని, రహిని = బాగుగా, తనుకంజేయును = కనుపడునట్లు చేయును, తత్ + అచేతనములణ్ = ఆ తెల్వి లేని వస్తువులచేత, ఒక + అప్డుణ్ = ఒక సమయంబునందయినను, స్వరుచిని = తన తేజస్సును, పడయండు = చెందఁడు.

తా. చీఁకటిలోనుండు కుండ మొదలయిన వస్తువులు దీపముచేతఁ దెలియఁ బడును, కాని యవి దీపంబును దెల్పఁ జాలవు, ఆరీతిగా మనస్సు బుద్ధిమొదలయినవానిని ఆత్మ తెల్పుచున్నది. కాని యీజడం బులయిన యింద్రియాదు లాత్మను దెల్పఁజాలవు.

(ఉపమానాలంకారము.)

అవతారిక. ఆత్మ యహంకారము మొదలయిన వాని చేతఁ దెలియఁబడనప్పటికిని జ్ఞానమును మఱియొకవస్తువు చేతఁ దెలియఁబడుచున్నది. అను ననుమానంబునకు ఆత్మ స్వరూపంబునకన్న మఱియొక్క జ్ఞానాంతరం బుండ దని సోదాహరణముగాఁ దెల్పుచున్నారు.

శ్లో॥ స్వబోధేనాన్యదీపేచ్ఛా, బోధరూపతయాత్మనః।
నదీపస్యాన్యదీపేచ్ఛా, యథాస్వాత్మప్రకాశనే॥

కం. దీపంబుఁజూడ నొండొక।
దీపముఁదేరఁగడఁగు పగిదియకాదే చి।
ద్రూపుండగు పరమాత్ముని।
దోఁపింపఁగ నన్యబుద్ధితోఁ బనియెల్లన్॥ 30

టీక. చిత్+రూపుండు = జ్ఞానస్వరూపుఁడు అగు, పరమాత్మునిని, తోఁపింపఁగన్ = కనుపడునట్లు చేయుటకు అన్యబుద్ధితోన్ = మఱియొక్కటియయినబుద్ధితో, పని ఎల్లన్ = అంతయును, దీపమును, చూడన్ = చూచుటకు, మఱియొకదీపమున్ (ను), తేరన్ = తెచ్చుటకు, కడఁగు = ప్రయత్నించు, పగిదియకాదే = రీతియేకదా?

తా. దీపమును దెల్పుటకు మఱియొక్కదీప మనవసరము; ఆ రీతిగానే సమస్తమును దెల్పునట్టి యాత్మను దెల్పుటకు మఱియొక్క జ్ఞాన మవసరముకాదు. అని తెలిసికొనవలయును.

(ఉపమానాలంకారము.)

అవతారిక. బుద్ధి మొదలయినవి ఆత్మను తెలిసికొనలేనియెడల దానిని తెలిసికొనుట కేది యుపాయం బను ననుమానంబునకు సమాధానరూపమయిన యుపాయంబు శ్రీజగద్గురువులవారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ నిషిధ్య నిఖిలోపాధీన్, నేతినేతీతివాక్యతః ।
విద్యాదైక్యం మహావాక్యై, ర్జీవాత్మ పరమాత్మనోః ॥

కం॥ కాదిది గాదిది యనియెడు ।
వేదార్థసరణి నుపాధివిసరము నెల్లం ।
బోఁదెగడుచు జీవాత్ముల ।
తాదాత్మ్యంబెఱుఁగఁదగు నుదారతరోక్తిన్ ॥ 31

టీక. ఇదికాదు, ఇద్దికాదు, అని యనియెడు, వేద + అర్థసరణిని = వేదాభిప్రాయముయొక్క పద్ధతితో, ఉపాధి విసరము నెల్లన్ = ఉపాధులయొక్క సమూహము నంతయును (కొంచెమెఱుంగుట చాలయెఱుంగుట మొదలయిన రీతులుగా నుండు నుపాధులు అన్నిటిని), పోఁదెగడుచున్ = విడిచి వేయుచు, ఉదారతర + ఉక్తిన్=మహావాక్యము చొప్పునను, జీవ + ఆత్మల = జీవునియొక్కయును ఆత్మయొక్కయును, తాదాత్మ్యంబును, ఎఱుఁగఁదగును.

తా. ఎన్నోఱాలలో నొకరత్నంబున్న సమయంబునం దురత్నపరీక్షకుఁడు సామాన్యమయిన ఱాలు రత్నములు కావని విడనాఁడు రీతిగానే పేర్లు రూపములు మొదలయిన యుపాధులన్నియును బరమాత్మకాదని వేదంబునందు నిషిద్ధము చెప్పఁబడిన తెఱంగున నెఱింగి జీవాత్మకును బరమాత్మకును భేదము వ్యవహారమునందే కాని సుషుప్తిలోనుండు అఖండానందరూపాత్మక పరమార్థములో ఆ భేదము లేదు అని మహావాక్యస్వరూపంబునం దెలిసికోవలయును.

అవతారిక. జడంబులుగా నుండునట్టి యుపాధులను త్రోసివేయనిచో ఆత్మ తెలియఁబడదు. త్రాటియందు పాము అనుభావము కల్గినప్పు డా భావము అసత్యమని తెలిసి వారింపఁ బడనియెడల అయ్యది త్రాడు అని తెలిసికొనుటకు వీలులేదు. అనువిషయము తెల్పఁబడుచున్నది.

శ్లో॥ అవిద్యకం శరీరాది, దృశ్యంబుద్బుదవత్ క్షరం ।
ఏతద్విలక్షణం విద్యా, దహం బ్రహ్మేతినిర్మలమ్ ॥

కం॥ తిలకింపఁదగు శరీరా ।
దులవిద్యాత్మకములగుటఁ ద్రుంగుడుపడు బు ।
గ్గలభంగిని దద్భిన్నా ।
మలచిన్మయుఁ డేన యంచు మదినెఱుఁగఁజనున్ ॥ 32

టీక. తిలకింపఁదగు = చూచుటకు వీలుగానుండు, శరీర + ఆదులు = దేహము మొదలయినవి (సమస్తములయిన యుపాధులు). అవిద్యా + ఆత్మకములు = అజ్ఞానముచేత నేర్పాటు చేయఁబడినవి అగుటన్ = కాఁబట్టి, బుగ్గలభంగిని = నీటిబుగ్గలవలె, త్రుంగుడుపడున్ = వినాశమునొందును, తత్ + భిన్న = వానికన్న వేఱయినట్టి, అమల = దోసంగులేని (జర, మరణము, క్షుత్తు, పిపాస, మొదలయిన మాలిన్యములు లేనిదగు), చిత్ + మయుఁడు = జ్ఞానస్వరూపుఁడు, (బ్రహ్మము) ఏన = నేనే, అంచున్ = అని, మదిన్ = మనస్సునందు, ఎఱుఁగఁజనున్ = తెలిసికొనవలయును.

తా. అజ్ఞానముచేత నేర్పాటు గావింపఁబడిన శరీరము మొదలయిన యుపాధులు నీటిబుగ్గలవలె వినాశమునొందును. దానంజేసి వానికన్న ప్రత్యేకముగాను, జరా మరణ క్షుత్పిపాసా మోహ శోకంబు లనియెడి షడూర్ములచేత మలినపఱుపఁబడకయును ఉండు పరమాత్ముఁడను నేనేయని తెలిసికోవలయును.

అవతారిక. "పంచకోశాది" శ్లో॥ మొ॥ "అవిద్యాకం శరీరాది "శ్లో॥ వఱకుఁగలయవి యపరోక్ష సాక్షాత్కృతిం గల్గించు శ్రవణపద్ధతి—ఈపయిని 5 శ్లోకములు మననవిధానము.

శ్లో॥ దేహాన్యత్వాన్నమే జన్మ, జరాకార్శ్యలయాదయః।
శబ్దాది విషయస్సంగో, నిరింద్రియతయా నచ॥

కం. తనువులకు విలక్షణుఁడను।
నను జన్మజరాకృశత్వ నాశాదులు లోఁ।
గొనవు హృషీకవిహీనతఁ।
బెనఁగవు శబ్దాదివిషయ బృందము లెల్లన్॥ 33

టీక. తనువులకు = శరీరములకు, విలక్షణుఁడను = ప్రత్యేకమయిన వాఁడను (అయిన), ననున్, జన్మ = పుట్టువు, జరా = ముసలితనము, కృశత్వ = చిక్కిపోవుట నాశ + ఆదులు పాడయిపోవుట మొదలయినవి (అస్తే - జాయతే - వర్ధతే - పరిణమతే - అపక్షీయతే - వినశ్యతి-

అనునవి షడ్భావ వికారములు), లో(గొనవు = లోపబడువు (చెందవు). హృషీకవిహీనతన్ + ఇంద్రియములు లేమింజేసి, శబ్ద + ఆదివిషయబృంనములు + ఎల్లన్ = శబ్దను మొదల యిన (శబ్దము స్పర్శము రూపము రసము గంధము అనునట్టి) విషయముల యొక్క సమూహములన్నియును, (నన్ను) పెన గవు = చుట్టుకొనవు (చెందవు).

తా. నేను స్థూల సూక్ష్మ కారణ శరీరంబులకు బరు డను. కాబట్టి నాకు జరామరణములు చిక్కిపోవుట వినాశము చెందుట మొదలయిన వికారములు లేవు. అంతియకాక నాకు ఇంద్రియములు లేవు కనుక శబ్ద స్పర్శ రూప రస గంధ ములను విషయంబులతో సంబంధంబును నాకు లేదు.

అవతారిక. మనస్సు లేని ఆత్మకు సుఖదుఃఖము లెక్క డివని తీర్మానము.

శ్లో॥ అమనస్త్వాన్న మే దుఃఖ, రాగద్వేషభయాదయః ।
అప్రాణోహ్యమనా శ్శుభ్ర, ఇత్యాదిశ్రుతిశాసనాత్ ॥

కం. ప్రాణము చిత్తము కలుషము ।
లోనగునవి లేని నిర్మలుండను శ్రుతి వా ।
క్యానుసరణి లేవు మనో ।
హీనుడను నాకవగపు నిచ్చయు వెలిపున్ ॥ 34

టీక. శ్రుతివాక్య + అనుసరణిన్ = వేదవాక్యాను సారముగా, ప్రాణము(ను) చిత్తము = మనస్సు(ను), కలు

షము = దొసఁగు(ను), లోనగునవి, లేని, నిర్మలుండను (ఆరీతిగా) మనః + హీనుఁడను = మనస్సులేని వాఁడను (అయిన), నాకు, పగపుల్ = చింతయును, ఇచ్చయుల్ = కోర్కియును, వెఱపుల్ = భయమును, లేవు.

తా. వేదప్రమాణానుసారముగా ఆత్మకు (సుషుప్తి యందు) మనస్సు ప్రాణము దొసఁగు మొదలయినవి లేవు. మనస్సులేని యట్టినాకు రాగము ద్వేషము భయము మొదలయినవి వేవు. అట్టి యాత్ముఁడనయిన నేను నిర్మలుండను, పరిపూర్ణుండను, నిత్యానంద స్వరూపుండను.

అవతారిక. గురుకృపంజేసి తెలిసికొన్న యభిప్రాయము శ్రీ వారు 3 శ్లోకములతో దెల్పుచున్నారు.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో, నిర్వికల్పో నిరంజనః ।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽస్మినిర్మలః ॥

క.॥ స్థిరతరుఁడ నిత్యముక్తుఁడఁ ।
గరణగుణవిహీన నిర్వికల్పుండ వికా ।
రరహితుఁడ నిరంజనుఁడను ।
బరమపవిత్రుండ రూప వర్జితుఁడఁ దగన్ ॥ 35

టీక. (నేను), స్థిరతరుఁడన్=ఎప్పుడును ఉండువాఁడును నిత్యముక్తుఁడన్ = ఎప్పుడును విడివడి యుండువాఁడను, గుణహీనుఁడను = సత్త్వాదిగుణములు లేనివాఁడను, నిర్వికల్పుండను = అంతులేని వాఁడను, వికారరహితుఁడను = వికారము లేనివాఁడను, నిరంజనుఁడను = మయిల లేనివాఁడను,

పరమ పవిత్రుండ(నే) = మిక్కిలి నిర్మలుండను, రూప వర్జితుఁడఁ (ను) = రూపము నొందని వాఁడను.

అవతారిక. పయిని కారణంబుతో నిశ్చయింపఁబడిన యాత్మయొక్క కలరూపింకను నెట్లిట్లుండుననుటకు సమాధానము.

శ్లో॥ అహ మాకాశవ త్సర్వం, బహిరంతర్గతోఽచ్యుతః ।
సదాసర్వసమ స్సిద్ధో, నిస్సంగో నిర్మలోఽచలః ॥

కం॥ వ్యోమమువలె బహిరంత ।
ర్యామి నగుచు నంతటను నెరసిమెఱయు ననూ ।
నామలమూర్తిని సాంగ ।
త్యాము క్తుఁడ నచపలుండ నఖిలసముండఁ ॥ 36

టీక. (నేను), వ్యోమమువలెఁ = ఆకాశముపలె, బహిః + అంతః + యామిని = బయటనులోపలను వ్యాపించువాఁడను, అగుచుఁ = అయి, అంతటను, నెరయఁ = కలియునట్లుగా, మెఱయు = ప్రకాశించునట్టి, అనూన = హెచ్చయిన, అమలమూర్తిని = నిర్దోష స్వరూపుఁడను, సాంగత్య + ఆముక్తుఁడఁ = రాగద్వేషాది లోకసంగతినుండి విడువఁబడినవాఁడను, అచపలుండఁ = కదలనివాఁడను, అఖిల సముండఁ = అన్నింటను సమానత్వముగల వాఁడను.

అవతారిక. మఱియు ఆవిషయమే దృఢపఱుపఁబడుచున్నది.

శ్లో॥ నిత్య శుద్ధవిముక్తైక, మఖండానంద మద్వయమ్ ।
సత్యం జ్ఞానమనంతం య, త్పరం బ్రహ్మాహమేవతత్ ॥

క॥ ధ్రువుడు యదృచ్ఛుఁ డనంతుఁడు ।
వివిక్తుఁ డద్వయుఁడు హర్ష విజ్ఞానమయుం ।
డవికలుఁడును సత్యుండును ।
నవునేఁ డయ్యాత్ముఁ డేనయై విలసింతున్ ॥ 37

టీక. ధ్రువుఁడు = ఎల్లప్పుడును నుండువాఁడును, యదృచ్ఛుఁడు = ముక్తిస్వరూపుఁడును, అనంతుఁడు = అంతు లేని వాఁడును, వివిక్తుఁడు = ఒంటరియును, అద్వయుఁడు = ప్రతిలేనివాఁడును. హర్షవిజ్ఞానమయుఁడు ఆనందము యొక్కయును విజ్ఞానము యొక్కయును రూపయినవాఁడును, అవికలుఁడు = వైకల్యము (చెడుట) లేని వాఁడును, నిత్యుఁడు = దిక్కులు కాలము మొదలయినవానిచే అనవచ్ఛిన్నుండును, ఏఁడు = ఎవడు, అవున్ = అగునో, ఆ, ఆత్ముఁడు = పరమాత్ముఁడను, ఏనయై = నేనెయై, విలసింతున్ = ప్రకాశింతును.

తా. ఎట్టిసంబంధమును దేనితోను జెందక, కామక్రోధలోభమోహ మదమాత్సర్యములు అను అరిషడ్వర్గము లేక, అఖండాభేదానందస్వరూపంబు గల్గినదియై, ఒంటరి యయినదై పంచభూతంబుల యునికిం జెందనిదియై, సత్యంబై అనఁగా దిక్కులు కాలము మొదలయినవాని వలన నెట్టి మార్పును జెందనిదియై, యెల్లప్పుడు నుండునదై, సర్వ వ్యాపకంబై, సర్వాంతర్యామియై, పుణ్యంబుం బాపంబును లేనిదై పరిశుద్ధంబయినదై, సత్త్వాదిగుణంబులు లేనిదై, కోరుటయును విరోధపడుటయును లేనిదై, స్థూలసూక్ష్మకారణ శరీరంబుల

ఘం బరంబయినదై, అవస్థాత్రయంబునందు నాశంబు నొందక సాక్షిరూపంబుగా నుండునట్టిదియును అయిన పరబ్రహ్మంబును నేనె యనివేదవాక్యంబులచేత జెప్పఁబడిన దానిని మననంబు గావింపవలసినది.

అవతారిక. పయినఁ జెప్పినరీతిని మననంబు చాలకాలముగావించినచో మోక్షము నొందవచ్చు నని నిదిధ్యాసముఖమున శ్రీవారు వచియించుచున్నారు.

శ్లో॥ ఏవం నిరంతర కృతా, బ్రహ్మైవాస్మీతి వాసనా ।
హరత్యవిద్యావిక్షేపాన్, రోగా నివ రసాయనమ్ ॥

కం॥ ఏను బరమాత్ముఁ డననెడి ।
మానని తాత్పర్య మహిమ మట్టువఱచు న ।
జ్ఞానజ విక్షేపమును రు ।
జానీకంబును దొలంచు నౌషధముక్రియన్ ॥ 38

టీక. ఏను, పరమాత్ముఁడను, అనెడి. మానని, తాత్పర్యమహిమ=అభిప్రాయముయొక్క గొప్పతనము, అజ్ఞానజ విక్షేపము = తెల్విలేమివలనఁగల్గు విసరును, రుజా + అనీకంబును = రోగముల యొక్క సమూహంబును, తొలంచు = పోఁగొట్టునట్టి, ఔషధము క్రియన్ = మందువలె, మట్టువఱచున్ = వినాశము నొందించును.

తా. మందు తినుటవల్ల రోగంబులు నశించిన తెఱంగున, ఎల్లప్పుడును పరమాత్ముఁడను నేను - కాని అంత

కన్న నితరుండనుకాను అను నభ్యాసంబు గావించుటం జేసి కల్గిన సద్వాసన అజ్ఞానవిక్షేపమును సంపూర్ణంబుగా నశియింపం జేయుచున్నది అని మిక్కిలి గట్టిగా విశ్వసింపవలయును.

(ఉపమానాలంకారము.)

అవతారిక. పయిని అర్థమును మననము గావించుటకు, గొన్ని పద్ధతులు.

శ్లో॥ వివిక్త దేశఆసీనో, విరాగో విజితేంద్రియః ।
భావయే దేకమాత్మానం, తమనన్త మనన్యధీః ॥

కం॥ విజనస్థలోపవిష్టుండు ।
విజితేంద్రియ సంచయుండు వీతేచ్ఛుండునై ।
భజియింపందగు నమేయుని ।
నిజాన్య శూన్యుం బరమాత్ము నిశ్చలబుద్ధిన్ ॥ 39

టీక. విజనస్థల + ఉపవిష్టుండున్ = జనులులేనిస్థలమునందుం గూర్చున్న వాడును, విజిత + ఇంద్రియ సంచయుడున్ = జయింపంబడిన యింద్రియములయొక్క సమూహంబుంగలవాడును, వీత + ఇచ్ఛుండున్ = విడువంబడిన కోర్కులు గలవాండును, ఐ, అమేయునిన్ = కొలత చెప్పుటకు వీలుగానివాండును, నిజ + అన్యశూన్యున్ = తనకన్న నితరములేనివాండును, అయిన పరమాత్మని, (తానుగా ఆపరమాత్మ నేనెయని), నిశ్చలబుద్ధిన్ = చలనము లేని బుద్ధితో, భజయింపందగును = భావింపవలయును.

తా. జనులయొక్క సందడిలేనిస్థలంబునందుఁ గూర్చుండి ఆశలను విడనాఁడి యింద్రియంబులను జయించి మనస్సును జిక్కఁబట్టి పరమాత్ముఁడను నేనె యను భావంబుతో ధ్యానింపవలయును.

అవతారిక. భేదరూప ప్రపంచ జాగ్రదవస్థలో ఆత్మైకత్వభావన యేరీతిని? అనునను మానంబునకు సమాధానంబు శ్రీ వారిచే వచియింపఁబడుచున్నది.

శ్లో॥ ఆత్మన్యే వాఖిలం దృశ్యం, ప్రవిలాప్య ధియాసుధీః ।
భావయే దేకమాత్మానం, నిర్మలాకాశవత్సదా ॥

కం॥ అవలోక్యం బైనసకల ।
భువనంబుల నుజ్జ్వలమతి బుధుఁ డాత్మునియం ।
దు విలయ మొనర్చి కేవలుఁ ।
బ్రవిమలగగనమును బోలె భావింపఁ జనున్ ॥ 40

టీక. అవలోక్యంబు + అయిన = చూడఁదగిన, సకల భువనంబులును = సమస్తలోకంబులును ఉజ్జ్వలమతిన్ = (కామక్రోధములు లేక) వెలుంగు బుద్ధితో, బుధుఁడు = తెల్విగలవాఁడు, ఆత్మునియందు = పరమాత్మయందు (తనయందు), విలయము + ఒనర్చి = లయంబొందించి, కేవలున్ = (తనను), ప్రవిమలగగనమునుబోలెన్ = దొసఁగులేని యాకసంబును బలె, భావింపఁజేనును.

తా. ఏరీతిగా మానవునికి నిద్రావస్థయందుఁ బ్రపంచంబగుపడదో ఆరీతిగా తెల్విగలవాడు ఈ పేర్లు రూపములుగల

సమస్తంబయిన ప్రపంచంబును కలఁకలేని బుద్ధితో నాత్మ యందు లయింపఁజేసికొని యెల్లప్పుడును నిర్మలంబయిన యాకసంబుం బలెఁ బరమాత్మునిని దననుగాఁ దలంప వలయును.

అవతారిక. పేర్లు రూపులు జాతులు క్రియలు మొదలయిన రూపములతోనుండు సమస్తజగత్తునంతయును అజ్ఞానమునం జేసి కల్గఁజేయఁబడినందున తల్లోకమంతయును నసత్యం బని త్రోసి రాజుగావించి,

శ్లో॥ రూపవర్ణాదికం సర్వం, విహాయ పరమార్థవిత్ ।
పరిపూర్ణచి దానంద, స్వరూపేణావతిష్ఠతే ॥

కం॥ సారార్థవేదివర్ణా ।
కారాదిక మగు నిఖిలముఁ గడఁద్రోయుచు నిం ।
డారిన చిత్సుఖరూపుం ।
డైరంజిలుచుండుఁ దానుశ్రాంతంబుక్ ॥ 41

టీక. సార + అర్థవేది = పరమార్థమును (జ్ఞానమును) తెలిసినవాఁడు, వర్ణ + ఆకార + ఆదికము + అగు=కులము (బ్రాహ్మణుఁడు మొదలయిన జాతులు) రూపము (మనుష్యుఁడు మొదలయిన రూపములు) మొదలయినవి కలదియగు, నిఖిలము = (ఈ కనుపడు) సమస్త ప్రపంచమును, కడఁద్రోయుచుక్ = (ఇదంతయును నవిద్యచేత నేర్పాటయినదని) విడనాడుచును, నిండారిన=పరిపూర్ణంబయిన, చిత్ సుఖరూపుండు +

ఐ = జ్ఞానానందస్వరూపుండు ఐ, తాను, అశ్రాంతంబుగ = ఎల్లప్పుడును, రంజిలుచుండుఁగ = ఆనందించుచుండును.

తా. తెలివి నెఱింగినవాఁడు అవిద్యచేత నేర్పాటు చేయఁబడిన యీ పేర్లును రూపములును మొదలయినవి గల లోకంబునంతయును ఆత్మకన్నను ప్రత్యేకంబయినదానినిగా నెఱింగి సత్యంబై జ్ఞానానందమయంబై సుషుప్తియందు విభజించుటకు వీలులేని అఖండస్వరూపుఁడయిన తనయందు మనస్సు అనునది లేమింజేసి సమస్తంబయిన జగంబును లేనిదేయగును,/ కాఁబట్టి యిది యంతయును మనస్సుచేతఁ గల్పింపబడినదే కాని సత్యంబు కాదని నిశ్చయించి యెడతెగని యానంద మయంబయిన రూపంబుతో నుండును.

అవతారిక. జ్ఞాత – జ్ఞానము – జ్ఞేయము (తెలిసికొనువాఁడు – తెలివి – తెలిసికోఁదగినది) అను త్రిపుటి (మూఁటి సముదాయము) తేఁటతెల్లముగాఁ గనుపడుచున్నది కదా? అప్పుడు ఆత్మకు ఒకటి అను స్వభావ ముండుటకు వీలెట్లగును? అను ప్రశ్నకు సమాధానముగా ఆత్మలో ఈ భేదంబులు ఉండుట నిక్కము కాదని తెల్పఁబడియెడిని.

శ్లో॥ జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ భేదః, పరే నాత్మని విద్యతే ।
చిదానందైక రూపత్వా, ద్దీప్యతే స్వయమేవ తత్ ॥

కం॥ జ్ఞానము జ్ఞేయము జ్ఞాతయు ।
నానామరువిభేదములు చనవు విభునిఁ జిదే ।
కానందుండగు కతమునఁ ।
దా నిచ్చలు నివ్వటిల్లుఁ దనకుం దానై ॥ 42

టీక. జ్ఞానముఁ = తెలివియును, జ్ఞేయముఁ = తెలిసికొందగినదియును, జ్ఞాతయుఁ = తెలిసికొను వాఁడును, నాఁ = అని, అమరు = ఒప్పునట్టి, విభేదములు=భేదములు, విభుసిఁ= పరమాత్మునిని, చనవు = చెందవు, (అతఁడు), చిత్ = ఏక + ఆనందుండు జ్ఞానానందైక రూపుండు, అగు కతమునఁ = అయిన కారణము నంజేసి, తాను, నిచ్చలుఁ = ఎల్లప్పుడును తనకుతానై, నివ్వటిల్లుఁ = ప్రకాశించును.

తా. ఆత్మయందు స్వప్నజాగ్రదవస్థలయందు తెలిసి తెలిసికొనువాఁడు తెలిసికొనబడఁదగినది అను భేదములు కానుపించెడిని. అయినను ఈ భేదములు నిజమునకు ఆత్మలో లేవు, కనుక ఇయ్యవి అసత్యంబుగా అవిద్యచేత ఆత్మకుఁ గల్పింపఁబడి వ్యావహారికముగా ఆత్మలోఁ గనుపట్టుచున్నవి. కాని మహావాక్యాభిప్రాయప్రకారముగా విచారించిన యెడల ఆత్మయందీభేదము ఎంతమాత్రమును ఏరీతిగాను లేదు. ఎందుకందురా ? ఆత్మసత్యజ్ఞానానందమయుండు. కనుక స్వయంప్రకాశుండగును,

అవతారిక. “ వివిక్తదేశ ” శ్లో॥ మొ॥ “ జ్ఞాతృజ్ఞాన ” శ్లో॥ వఱకు మనన నిదిధ్యాసనపద్ధతులు చెప్పఁబడినవి. ఈ పయినను శుద్ధవస్తుధ్యానమునకుఁ బ్రత్యక్షఫలంబు చెప్పఁబడియెడిని.

శ్లో॥ ఏవమాత్మారణౌ ధ్యాన, మథనే సతతం కృతే ।
ఉదితావగతిజ్వాలా, సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥

కం॥ ఈవగ నాత్మారణిలో ।
భావ నయను నిత్యమథన భవ్యక్రియచే ।

నావిర్భవించు జ్ఞానశి ।
ఖావిసర మెఱుంగమియను కట్టెల నేర్చుᳲ ॥ 43

టీక. ఈవగᳲ = ఈరీతిగా, ఆత్మ + అరణౌ = ఆత్మయను అరణికొయ్యయందు, భావన=ధ్యానము, అను, నిత్య=ఎడతెగని, మథన = తఱచుట, (అనునట్టి), భవ్యక్రియచే = మంచిపనిచేత, ఆవిర్భవించు = పుట్టునట్టి, జ్ఞాన = తెల్వియనునట్టి, శిఖావిసరము = జ్వాలలసమూహము, ఎఱుంగమి = అజ్ఞానము, అను, కట్టెలᳲ = కఱ్ఱలను, ఏర్చుᳲ = కాల్చివేయును.

తా. ఈరీతిగా ఆత్మయనెడు అరణికొయ్యయందు ధ్యానంబను మథనంబుఁ గావించినచో జ్ఞానంబనునగ్నిజ్వాలాసమూహంబేర్పడి అజ్ఞానంబను వంటచెఱకులను గాల్చిపాఱవేయును.

(రూపకాలంకారము).

అవతారిక. జీవాత్మైక్య జ్ఞానములో దేహంబును ఇంద్రియంబులును తాను అను భ్రాంతి సంపూర్ణముగా నశించును. దానంజేసి సచ్చిదానందమయుండు అయిన పరమాత్మ స్వయంబుగాఁ దానే కనుపడును అని చెప్పఁబడియెడిని.

శ్లో॥ అరుణేనేవబోధేన, పూర్వం సంతమసే హృతే ।
తత ఆవిర్భవే దాత్మా, స్వయమే వాంశుమానివ ॥

కం॥ మునుమున్నగ సంతమసం
బును జొక్కపుటెఱుక యనెడు పొడుపుంజాయల్ ।
తునిచిన యంతటఁ బ్రద్యో ।
తనుచాడ్పున నాత్మ తనకుఁ దాన వెలుంగుᳲ ॥ 44

టీక. మునుమున్నుగన్ = ముందుగా, సంతమసంబును = (అజ్ఞానము అను) చీఁకటిని, చొక్కపు + ఎఱుక అనెడు = నిర్మలజ్ఞానము అనునట్టి, పొడుపుంజాయల్, అరుణకాంతులు, తునిచిన యంతటన్=భంగము చేయఁగా, ప్రద్యోతను చాడ్పునన్ = సూర్యునిరీతిగా, ఆత్మ, తనకుతానే, వెలుంగును. (రూపకానుప్రాణిత శ్లేషాలంకారము)

అవతారిక. ఆత్మనిత్య జ్ఞానస్వరూపి. కాఁబట్టి యతనిని నజ్ఞానంబునం జేసి పొందుటకు వీలులేదు. జ్ఞానంబునంజేసియె యాత్మను పొందవలయునని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఆత్మాతు సతతం ప్రాప్తోఽ, ప్యప్రాప్తవదవిద్యయా ।
తన్నాశే ప్రాప్తవద్భాతి, స్వకంఠాభరణం యథా ॥

కం॥ పరమాత్ముఁ డెల్లకాలము ।
దొరకియును నవిద్యకతన దొరకం డదియున్ ।
సరిపోయినచో నిజకం ।
ధరమందలితొడవు వోలెఁదక్కి వెలుంగున్ ॥ 45

టీక. పరమాత్ముఁడు ఎల్లకాలమును, దొరకియును - లభించువాఁడె యయినప్పటికిని, అవిద్యకతనన్ = అజ్ఞానకారణంబునఁజేసి, దొరకఁడు = లభింపడు. అదియున్ = ఆ యజ్ఞానంబు, సరిపోయినచోన్ = నశించినయెడల, నిజకంధరమందలి = సొంతమయినమెడలోని, తొడవువోలెన్ = ఆభరణము వలె, తక్కి = స్వాధీనంబై, వెలుంగును.

తా. ఒకానొకఁడు మైమఱపునంజేసి తన కంఠంబునందుండు నొకానొక యాభరణంబు లేదని దుఃఖము నొంది

కొంత కాలంబునకు తెల్వి గల్గి యది తన మెడలోనుండుట యె ఱింగి సంతసంబునొందును. ఆరీతిగా సత్యజ్ఞానానందమయుఁడయిన పరమాత్ముండు అంతట తానే యున్నాఁడు. అయినప్పటికిని సంసారములోఁ బడినవాఁ డా సంగతిని మఱచి తెల్విఁజెంది తన్నుఁదా నెఱింగి నిత్యానందమయుండుగాఁ గాన్పించెడిని.

అవతారిక. సచ్చిదానందమయుండై జీవుండు పరమాత్మకన్న నితరుండుగా నుండునుగదా ? అట్టిజీవునకును పరమాత్మకును ఐక్యమని జెప్పుటకే రీతిగా వీల్పడును ? అను ననుమానంబునకు సమాధానము.

శ్లో॥ స్థాణౌ పురుషవద్భ్రాంత్యా, కృతా బ్రహ్మణి జీవితా ।
జీవస్య తాత్త్వికే రూపే, తస్మిన్ దృష్టే నవర్తతే ॥

కం॥ ధ్రువమున బమ్మెరచే నరు ।
నవలోకించెడు వడువున నాత్మనిలో జీ ।
వవికల్ప మడరుఁ దత్త ।
త్త్వవిధమెఱుఁగ నాత్మ జీవతాత్యక్తుఁడగున్ ॥ 46

టీక. బమ్మెరచేన్ = భ్రమతో, ధ్రువమునన్ = (స్థిరమయిన) కొయ్యయందు, నరున్ = మనుష్యునిని, అవలోకించెడువడువునన్ = చూచురీతిగా, ఆత్మలోన్, జీవవికల్పము = జీవుఁడు అనువికారభావము, అడరున్ = ఒప్పును, తత్ + తత్త్వవిధము + ఎఱుఁగన్ = ఆ జీవునియొక్క యథార్థరీతిని నెఱింగినయెడల, ఆత్మ = ఆత్మయందు, జీవతాత్యక్తుఁడు + అగున్=జీవుఁడు అనుస్వభావమునుండి విముక్తుఁడగును.

తా. చీఁకటిలో నొక మొద్దుంజూచి దొంగగా భ్రమిం చినప్పుడు దానివలన భయకంపంబు లేర్పడును. కాని దాని నిజస్థితి తెలిసినతరువాత ఆ మొద్దునందు నారోపింపఁబడి యుండిన దొంగ యను స్వభావము పోయి దానివలని భయకం పాదులు నాశంబగును. ఆ రీతిగానే భ్రాంతింజేసి పరమాత్మ యందుఁ గల్పింపఁబడిన జీవత్వమునుగూర్చి శ్రుత్యుక్త పద్ధ తిగా నరసినయెడల తజ్జీవత్వము మాయంబయిపోయి తాను కర్తృత్వభోక్తృత్వంబులును చింతచీఁకటులును లేని పరమా త్మునఁడగును అని భావము.

అవతారిక. నరుఁడను నేను - నా కొడుకువీఁడు అని కనుపడుచున్నప్పుడు నేను నరుఁడను కానను టెట్లను నను మానంబునకు "అది యంతయు భ్రాంతివలన" నని సమా ధానము చెప్పఁబడుచున్నది.

శ్లో॥ తత్త్వస్వరూపానుభవా, దుత్పన్నం జ్ఞాన మంజసా ।
అహం మమేతి చాజ్ఞానం, బాధతే దిగ్భ్రమాదివత్ ॥

కం॥ పరమాత్మ రూపచింతా ।
పరిపాక ప్రభవబోధభానుద్యుతిస ।
త్వరముగ నాయది నే నని ।
మరపెడు నజ్ఞాన దిగ్భ్రమంబును బాపుర్ ॥ 47

టీక. పరమాత్మ = పరమాత్మునియొక్క, రూప చింతా = కలరూపును విచారించుటయొక్క, పరిపాకప్రభవ=

నిండుతనమునుండియేర్పడు, బోధభానుద్యుతి = జ్ఞానము అను సూర్యప్రకాశము, సత్వరముగన్ = వేగముగా, "నాయది" "నేను" అని, మరపెడి = తెల్వి తప్పించునట్టి (అజ్ఞానము అను), దిక్ + భ్రమంబును = దిక్కు: తెలియనిరీతిని, పోఁపును = పోఁగొట్టును.

తా. చీఁకటిలో దిక్కులు తెలియక భ్రమించువానికి సూర్యదర్శనంబునం జేసి ఆకలతపోయినట్లు అభేదాత్మానుభవంబునంజేసి "నేను నాయది" అను అజ్ఞానంబు పూర్ణంబుగా నశించును.

(రూపకాలంకారము.)

అవతారిక. ఆత్మతత్వమెఱింగిన వానికంతయును దన్మయంబుగానే కనుపడునని తెల్పఁబడుచున్నది.

శ్లో॥ సమ్యగ్వి జ్ఞానవాన్యోగీ, స్వాత్మన్యే వాఖిలంస్థితమ్ ।
ఏకంచ సర్వ మాత్మాన, మీక్షతే జ్ఞానచక్షుషా ॥

కం॥ సమధిక సంఖ్యాకృతసుఖ ।
యమివరుఁ డఖిలంబును దనయం దిడియాస ।
ర్వము నిర్విశేషమగు బ్ర ।
హ్మ మటంచుం జూచు సంవిదక్షులచేతన్ ॥ 48

టీక. సమధికసంఖ్యాకృతముఖయమివరుడు = విశేషమయిన విజ్ఞానము గా యోగీశ్వరుఁడు, అఖిలంబును = సమస్తమును, తనయందు, ఇడి = ఏర్పాటుచేసికొని, సర్వము, నిర్విశేషము + అగు = సమము అయిన,

బ్రహ్మమును, అంటుచు, సంవిత్ + అక్షులచేతన్ = జ్ఞాననేత్రంబులతో, చూచును.

తా. అనుమానాలోచనాది వైపరీత్యములు లేని బ్రహ్మజ్ఞాని సర్వమును తనయందే యుండినట్లుగాను, అన్నియును దనతో సమానముగాను, తానుగాను, జ్ఞానదృష్టితో నెఱింగి యానందమయుండై యుండును.

అవతారిక. ప్రత్యేకముగా కానవచ్చుచున్న యీ లోకం బాత్మకన్నఁ బ్రత్యేకంబయినది కానట్లు చెప్పుటకెట్లు వీల్పడునను ననుమానంబునకు సోదాహరణంబుగాఁ బ్రత్యుత్తరము చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఆత్మైవేదం జగత్సర్వ, మాత్మనోఽన్యన్నకించన ।
మృదోయద్వద్ఘటాదీని, స్వాత్మానం సర్వమీక్షతే ॥

కం॥ భాండములకన్న మృత్స్నయు ।
నొండైనది గాని భంగి నొప్పఁడు, పరమా ।
త్మం డీ దృష్టములకన ।
న్యుండయి యాతఁడె, జగమని యోగి దలంచున్ ॥ 49

టీక. మృత్స్నయున్ = మట్టి, భాండములకన్నన్ = కుండలకన్న, ఒండయినది=ప్రత్యేకంబయినది, కాని, భంగిన్ = రీతిగా, ఈ, దృష్టములకు = కనుపడునట్టివానికి, పరమాత్ముండు, అన్యుండయి = ప్రత్యేకమయినవాఁడై, ఒప్పఁడు = ఉండఁడు, ఆతఁడె = ఆ పరమాత్ముఁడె, జగము = లోకము. అని, యోగి = ఆత్మజ్ఞాని, తలంచును.

తా. మట్టితోఁ జేయఁబడిన కుండలు వేఱువేఱుగా తోఁచినప్పటికిని వాని ముఖ్యకారణవస్తువయిన మట్టి యొక్కటే యయినట్లు ఈ నామరూపమయంబయిన ప్రపంచంబంతయును జ్ఞానదృష్టితోఁ జూచినచోఁ బరమాత్మని కన్న నన్యంబయినది కాదనియు ఈ కనుపడువాని కన్నిటికిని ముఖ్యకారణం బాత్మయే అనియు నభేదభావమును జ్ఞాని చెందుచున్నాఁడు.

(ఉపమానాలంకారము).

అవతారిక. పయినఁ జెప్పఁబడిన యవస్థయే జీవన్ముక్తి యని వచింపఁబడుచున్నది.

శ్లో॥ జీవన్ముక్తిస్తు తద్విద్యా, త్పూర్వోపాధిగుణాం త్యజేత్ ।
ససచ్చిదాది ధర్మత్వాత్, భజే భ్రమరకీటవత్ ॥

కం॥ జీవన్ముక్తి యనంబడుఁ ।
గోవిదుని మొదటి యుపాధి గుణమోక్షము తా ।
దైవాఱును గీటం బళి ।
కైవడిఁ బరుఁడై చిదాది ఘనధర్మతతిన్ ॥ 50

టీక. కోవిదుని = జ్ఞానియొక్క మొదటి = మొదటఁ జెప్పఁబడిన, ఉపాధిగుణమోక్షము = దేహములు ఇంద్రియములు గుణములును అనువానినుండి విడుదల, జీవత్ + ముక్తి = బ్రతికియుండఁగానే (జీవునికి) విడుఁదల, అనఁబడును తాను = ఆ జ్ఞాని, కీటంబు అళికైవడిన్ = పురుగుతుమ్మెద అయినరీతిని (భ్రమరకీటన్యాయముగా), పరుఁడు + ఐ, చిత్ +

ఆదిఘనధర్మతతిఁ = జ్ఞానాదుల (జ్ఞానము ఆనందము మొదలయినవాని) యొక్క గొప్పధర్మములతోఁ, పరుఁడై = పరమాత్ముఁడై, డై వాఱును = ప్రకాశించును.

తా. తుమ్మెద యొకానొక పురుగును గైకొనివచ్చి కొన్నిపద్ధతులు చేసినంత ఆ పురుగు భయముతో కదలక యుండి తానును తుమ్మెదరూపమును జెందును. ఆ రీతిగానే శ్రవణమననాదులయిన పయినఁదెల్పినపద్ధతులచేత ఆత్మవిచారణము జరగఁగా జీవుండు బ్రహ్మస్వరూపంబును జెంది వృత్తిలేని వాఁడై యుండుట జీవన్ముక్తి.

అవతారిక. ఆత్మ ఎప్పుడును ఆనందమయుండు.

శ్లో॥ తీర్త్వా మోహార్ణవం హత్వా, రాగద్వేషాదిరాక్షసాన్ ।
యోగీ శాంతిసమాయుక్తః, ఆత్మారామో విరాజతే ॥

కం॥ యోగియు మోహాబ్ధిఁగడచి ।
రాగద్వేషాదిదైత్య రాజి నడఁచి తా ।
రాగిలు నాత్మారాముం ।
డై గెంటని శాంతి మదిని నలరారంగన్ ॥ 51

టీక. యోగియున్ = జ్ఞాని, మోహ + అబ్ధిన్ = అజ్ఞానము అను సముద్రమును, కడచి = దాఁటి, రాగద్వేష + ఆది దైత్యరాజిన్ = కోరిక విరోధము మొదలయిన రాక్షసుల యొక్క, వరసను అడఁచి = అణఁగించి, తాను, ఆత్మ + అ + రాముండై, ఆత్మయను విష్ణువగు శ్రీరాముఁడై (ఆత్మ శ్రీరామునింబోలి), మదిని = మనస్సునందు, గెంట

ని శాంతి = అణపఁబడని శాంతి, అలరారంగన్ = ఒప్పఁగా, రాగిలున్ = ఒప్పును.

(రూపక శ్లేష)

తా. శ్రీరామచంద్రులవారు సముద్రంబు దాఁటి రాక్షసులను సంహారంబు గావించి సీతను చెంది తన పురికి నేతెంచి ప్రకాశించిన తెఱంగున జ్ఞాని యయినవాఁడు జ్ఞానంబని యెడి ఓడతో నజ్ఞానంబనునట్టి సముద్రంబును దాఁటి కామ క్రోధములు మొదలయిన శత్రురాక్షసులను సంహారంబు గావించి శాంతి యను దేవిని జెంది సర్వదా సుషుప్తిలో నున్నట్లుగా వృత్తులు లేక సదాఽఽనందమయుండుగాఁ దనరుచున్నాఁడు అని భావంబు. (శ్రీమద్రామాయణకథ అనుసంధేయము).

శ్లో॥ బాహ్యానిత్యసుఖాసక్తిం, హిత్వాఽఽత్మసుఖ నిర్వృతః ।
ఘటస్థదీపవచ్ఛశ్వ, దంతరేవ ప్రకాశతే ॥

కం॥ వెలుపలి నశ్వరసౌఖ్యం ।
బులయందలి తగులు ద్రోఁచి బుధుఁ డాత్మసుఖో ।
జ్జ్వలమతియై తనలోని ।
చ్ఛలువెలయు ఘటస్థదీప సంకాశముగన్ ॥ 52

టీక. వెలుపలి = బయటి, నశ్వర = నశించునట్టి, (కనులు ముక్కులు మొదలయినవానిచే ననుభవింపఁఁగిన) సౌఖ్యంబులయందలి, తగులు = సంబంధమును, త్రోఁచి = వదలి, బుధుఁడు = జ్ఞాని (అయినవాఁడు,) ఉజ్జ్వలమతియై =

ప్రకాశించు మనస్సుగలవాఁడై, ఘటస్థదీపసంకాశముగన్ = కుప్పెలోని దీపము పోల్కితో, తనలో, నిచ్చలున్ = ఎల్లప్పుడును, వెలయున్ = ఒప్పును,

తా. విషయవాసనల నన్నిటిని విడిచి నిత్యానందమయుండయిన జీవుండు కుప్పెలోని దీపంబుంబలె తనకుఁదానే వెలుంగుచుఁ దనకుఁదానే సాక్షిగా నుండును.

(ఉపమానాలంకారము)

అవతారిక. పయినఁజెప్పిన రీతిని జీవన్ముక్తి నొందిన జీవుండు ప్రారబ్ధ వినాశపర్యంతమును ఉండవలసిన పద్ధతి శ్రీ జగద్గురువులవారిచే సెలవీయఁ బడుచున్నది.

శ్లో॥ ఉపాధిస్థోఽపి తద్ధర్మైః, రలిప్తో వ్యోమవన్మునిః ।
సర్వవిన్మూఢవత్తిష్ఠే, దసక్తో వాయువచ్చరేత్ ॥

కం॥ మునియు నుపాధిస్థితుఁడ ।
య్యు నభము క్రియఁ దద్గుణౌఘ మొందక సర్వం।
బు నెఱింగి మొఱకుఁబోలుచు
ననిలంబుకరణి నసక్తుఁడై చరియించున్ ॥ 53

టీక. మునియున్ = తెల్విగలవాఁడు (ముని = ఋషి = యోగి = జ్ఞాని,) ఉపాధిస్థితుఁడు = దేహము మొదలయినయుపాధులలో నుండువాఁడు, అయ్యును = అయినను, నభము క్రియన్ = (కుండలు మొదలయినవానిలో నుండు) ఆకసము రీతిగా, తత్ + గుణ = ఓఘము = వాని గుణముల సమూ

హము‌ను, ఒందక = చెందక, సర్వంబును, ఎఱింగి, మొఱకుర్ = మూర్ఖునిని, పోలుచు, అనిలంబుకరణిక్ = గాలివలె, అస క్తుఁడు = కోర్కి నొందనివాఁడు, ఐ, చరియించుర్ = సంచరించును.

తా. కుండలు మొదలయిన యుపాధులయందుండు నాక సం బాకుండలు మొదలయిన వానితో నెట్టి సంబంధమునొంది యుండ నట్లుఁగా జీవన్ముక్తి నొందినవాఁడు దేహాద్యుపాధి సంబంధంబు నొందక తనకన్నియును దెలిసియుండినప్పటికిని నేమియు నెఱుంగని యట్లు మెలఁగుచు కోర్కులు లేనివాఁడై గాలివలెనే ప్రారబ్ధవినాశపర్యంతమును సంచరించు చుండును.

(ఉపమానాలంకారము.)

అవతారిక. దేహవినాశానంతరము కైవల్యలాభ (శరీరము లేనిది) మేనా? యను ననుమానమునకు సమా ధానము.

శ్లో॥ ఉపాధివిలయా ద్విష్ణౌ, నిర్విశేషం విశేన్మునిః ।
జలే జలం వియ ద్వ్యోమ్ని, తేజ స్తేజసి వా యథా ॥

కం॥ జ్ఞానియు నుపాధు లంతం ।
బైనంతన నిర్విభేదుఁడయి విష్ణువునన్ ।
లీనుఁడగు నీరు నీరము ।
లోనగ్గిని నగ్ని మిన్నులో మిన్నుక్రియన్ ॥ 54

టీక. ఉపాధులు = దేహములు (3) అంతం బైనంతన, జ్ఞాని (యున్), నిర్విభేదుండు = భేదము లేనివాఁడు, అయ్యి,

విష్ణువున౯ = (అంతటను వ్యాపించినట్టి) పరమాత్మునిలో, నీరు, నీరములో౯ = నీటిలోను, అగ్ని, అగ్గిని = అగ్నిలోను, మిన్నులో = ఆకాశములో, మిన్ను = ఆకాశమును, క్రియ౯= రీతిగా, లీనుఁడు + అగు౯ = చేరినవాఁడగును.

తా. కుండలోనుండు నీరును అగ్నియును ఆకాశమును ఆకుండను విడిచి నీరు నీటిలోను (సముద్రములో) అగ్నిగొప్ప అగ్నిలోను ఆకాశ మఖండాకాశములోను చేరి ఆయాయఖండ వస్తువులయొక్క స్వరూపంబులను జెందిన తెఱంగున అంతః కరణాది శరీరత్రయ విముక్తిం జెందగానే జీవుండు శరీరములు లేని కేవలత్వంబును/ బొందిన మోక్ష ప్రాప్తుఁడగును. వాఁడు జ్ఞానానందస్వరూపమయిన సుషుప్తింజెంది మరల నిద్రమేల్కొన్న వానివలె లోకాభిముఖుండుగాక మఱియొక శరీరంబును బొందక సచ్చిదానందమయుండగును. (సుషుప్తి నందఱును అనుభవింతురు. కాని వారికజ్ఞానం బుండుటంజేసి జీవుండిట్టి యెడతెగని యానందమయుండని తెలియఁడు. అందుండువానికి ఏ భేదము లేక అంతయును నఖండముగా తా నుగాక తదవస్థలో వే ఱేద్దియును నుండమింజేసి యయ్యది నిష్ప్రపంచమయంబుగాను దుఃఖంబు లేనందున సౌఖ్యమ యంబుగాను ఉండును.)

(విదేహ కైవల్యప్రాప్తి ఉపమానంబులతో జెప్పఁ బడినది. కనుక ఉల్లేఖము.)

అవతారిక. సర్వాతిగంబయిన బ్రహ్మంబు యొక్క తాటస్థ్యలక్షణమునుగూర్చి శ్రీవారు 3 శ్లోకములను సెల విచ్చుచున్నారు.

శ్లో॥ యల్లాభా న్నాపరోలాభో, యత్సుఖా న్నాపరం సుఖం।
యజ్ఞానా న్నాపరంజ్ఞానం, తద్బ్రహ్మే త్యవధారయేత్ ॥ ✓

కం॥ ఏలాభ మఖిలలాభో ।
త్తాలంబగు, నే సుఖమును దక్కు సుఖంబుల్ ।
వోలవు, లేదే యెఱుకను ।
మేలైన యెఱుక, యదియసుమీ బ్రహ్మ మగున్ ॥ 55

టీక. ఏ = దేనియొక్క, లాభము = దొరకుట, అఖిల లాభ + ఉత్తాలంబు = సమస్తలాభములలో నెచ్చయినది, అగునో, ఏ = దేనియొక్క, సుఖమును, తక్కు = తక్కిన, సుఖంబులు, పోలవు(వో), ఏ = (దేనియొక్క,) ఎఱుకకు = తెల్వికన్నను మేలయిన, ఎఱుక = తెల్వి, లేదు (దో) అదియు, బ్రహ్మము అగును సుమీ !

తా. ఏది లభించుటకంటె నెచ్చయిన లాభమును దేని సౌఖ్యమునకన్న నెచ్చయిన సుఖంబును దేని తెల్వికన్న నెచ్చయిన తెల్వియును లేవో అదియే పరబ్రహ్మము.

శ్లో॥ యద్దృష్ట్వా నా పరం దృశ్యం, యద్భూత్వా న పునర్భవః ।
యజ్ఞాత్వా నాపరంజ్ఞేయం, తద్బ్రహ్మేత్య వధారయేత్ ॥

కం॥ ఎది దోఁపదృశ్యమొండుం ।
డదు, దేని నెనయఁ బునర్జనన ముక్కుఱు, నె ।
య్యది బుద్ధమైన నొప్పా ।
రదితర వేద్యం, బదియె పరబ్రహ్మ మగున్ ॥ 56

టీక. ఎది, తోఁపక = కన్పడినయెడల, = దృశ్యము చూడఁదగినది, ఒండు = మఱియొకటి, ఉండదు(దో), దేనిని, ఎనయక = చెందినయెడల, పునః + జననము = మరలఁబుట్టుట యనునది, ఉక్క + అఱక = వినాశమొందునో (నసి తప్పునో), ఎయ్యది, బుద్ధము + ఐనక = తెలియఁబడిన దయినచోఁ, ఇతరవేద్యంబు = తెలియఁదగినట్టిది మఱియొకటిఁ, ఒప్పారదు=ఉండదో, అదియె,పరబ్రహ్మము అగును.

తా. దేనినిగనుంగొన్నపిమ్మటఁ జూడఁదగినదియును, దేనిం జెందినపిమ్మటఁ బునర్జన్మంబును, దేని నెఱింగిన పిమ్మట నెఱుఁగఁ దగినదియును నుండవో అదియే పరబ్రహ్మము.

శ్లో॥ తిర్యగూర్ధ్వమధః పూర్ణం, సచ్చిదానందమద్వయమ్ ।
అనంతం నిత్యమేకం య, త్తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥

కం॥ క్రిందను మీఁదనునడుమను ।
గ్రందై యెయ్యదినెరసియుఁ గడు సత్యచిదా ।
నందైక మనంతము నయి ।
పొందుకొను నెదియదిబ్రహ్మముగ నెన్నఁదగుక ॥ 57

టీక. ఎయ్యది = ఏది, క్రిందను = క్రిందికిని, మీఁదను= పయికిని, క్రందై = నిండుకొన్నదై, నెరసి = వ్యాపించి, నెగడుక = ప్రకాశించునో, సత్యచిత్ + అనంద + ఏకముం అఖండసచ్చిదానందమును, అనంతముక = అంతులేనిదియును, అయి, పొందుకొనుక = ఒప్పునో, అది, బ్రహ్మముగా, ఎన్నఁదగును.

తా. క్రిందికిని - మీఁదికిని ప్రక్కలకును అంతటను వ్యాపించి అంతులేని సచ్చిదానందమయంబు అయినదియును నిత్యంబయినదియును అగువస్తువే బ్రహ్మము.

అవతారిక. బ్రహ్మేతర వస్తువులగు నింద్రియాదు లసత్తులని యుపనిషదభిప్రాయమని తెల్పఁబడు చున్నయది.

శ్లో॥ అతద్వ్యావృత్తిరూపేణ, వేదాన్తైర్లక్ష్యతే ఽవ్యయమ్ ।
అఖండానందమేకం య, త్తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥

కం॥ శ్రుతిసారమెట్టిమూర్తికి ॥
వ్యతిరిక్తంబుల నసత్యమని కను నయ్యా ।
చ్యుతుని నఖండసుఖైకా ।
కృతిని బరబ్రహ్మమనుచు దృఢపఱుపఁ దగున్ ॥ 58

టీక. శ్రుతిసారము = వేదాంతము, ఎట్టి, మూర్తికి = స్వరూపంబునకు, వ్యతిరిక్తంబులన్ = ప్రత్యేకంబులయినవానిని, అసత్యము + అని = అసత్తు అని, కనున్ = తలంచునో, ఆ, అచ్యుతునిన్ = చెడిపోవుట లేనివాఁడును, అఖండ సుఖ + ఏక + ఆకృతిని = అంతులేని సుఖముయొక్క గొప్ప రూపుగల వాఁడును అగువానిని, పరబ్రహ్మము, అనుచున్ = అని, దృఢపఱుపఁదగును.

తా. బ్రహ్మమునకుఁ బ్రత్యేకంబులయిన దేహేంద్రియాదులు అసత్తనియును అఖండానందమయంబును అచ్యుతంబును అగు మిగిలినదే బ్రహ్మంబని యుపనిషదభిప్రాయము.

అవతారిక. బ్రహ్మ మొదలయిన వారికి నఖండా నందంబు గలదుగదా ? అశ్వమేధములు మొదలయిన తల్లోకంబులను పొందుపొంచెం గావింపఁబడుచున్నవి. అట్టివారు పరమాత్మ స్వరూపంబు లేల కారు. అను ననుమానంబునకుఁ బ్రత్యుత్తరంబు.

శ్లో॥ అఖండానందరూపస్య, తస్యానందలవాశ్రితాః ।
బ్రహ్మాద్యాస్తారతమ్యేన, భవన్త్యానందినోలవాః ॥

కం॥ అవికలసుఖ రూపుండయి ।
పావణిలు నయ్యాత్మ నెలమియందు నజాదుల్ ।
లవమొంది తరతమాప్తిని ।
నవరిల్లెద రల్పులగుచు నమోద్యానమునన్ ॥ 59

టీక. అవికల సుఖరూపుండు + అయి = అఖండానంద రూపుండై, పావణిలు = ఒప్పునట్టి, ఆ, ఆత్మ = పరమాత్మని యొక్క, ఎలమి యందు = ఆనందమునందు, అజ + ఆదుల్ = బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మొదలయిన వారు, లవము + ఒంది = ఒకకణమాత్రముగా పొంది, నమోద్యానమునన్ = (ఆ) ఆనందములో తరతమ + ఆప్తిన్ - తక్కువ ఎక్కువ అనురీతులను చెందుటచేతను, అల్పులు + అగుచున్ = చిన్నవారగుచు, నవరిల్లెదరు = పొసఁగెదరు.

తా. మృత్కణంబు నందును హిమాలయమునందును ఉండు మట్టియును వస్తువొక్కటే యయినను పరిమాణభేదము

న్నది. ఆరీతిగానే బ్రహ్మవిష్ణు ముఖ్యములయిన సమస్తభూతంబులును భిన్నభిన్నానందంబుల నొందిన యట్లొప్పుచుటంజేసి వారియానందంబు లాత్మస్వరూపాఖండానందంబుతో సమంబులు కావు.

అవతారిక. ఆత్మేతరస్వరూపంబులయిన శరీరాదులయందు నెచ్చయిన ప్రీతియును నాత్మయందు తక్కువయయిన ప్రీతియును నుండఁగా నాత్మ ప్రీతిస్థానం బేరీతిగాఁ గాఁగలడను ననుమానంబునకు సమాధానంబు.

శ్లో॥ తదుక్తమఖిలం వస్తు, వ్యవహారశ్చిదన్వితః ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ, క్షీరే సర్పిరి వాఖిలే ॥

కం॥ తదుపాహితంబయి నిఖిల ।
పదార్థములు నెల్లక్రియలు ప్రజ్ఞాన్వితమై
పొదలుటచే నతఁ డంతటఁ ।
బొదివి పయోమిళితఘృతము వోలెఁ దనర్చున్ ॥ 60

టీక. నిఖిలపదార్థములును = పంచభూతాది సమస్తవస్తువులును, ఎల్లక్రియలును = అన్నిపనులును, తత్ + ఉపాహితంబు + అయి=ఆయాత్మునిచేతనొప్పఁబడి, ప్రజ్ఞా + అన్వితమై = తెల్వితోఁగూడినరీతిని. పొదలుటచే, అతఁడు = ఆపరమాత్ముఁడు, అంతటను, పొదివి = వ్యాపించి (ఒప్పి), పయః + మిళితఘృతముపోలెన్ = పాలలోఁగలసిన నేయివలె, తనర్చున్ = ఒప్పును.

తా. పాలయందంతటను సత్పదార్థంబయిన నేయి వ్యాపించియుండుటవల్ల అది మనకు నిష్టముగా నుండును.

అందుండి నేయి చిలికికై కొనఁబడినచో ఆనేయి మనకు మిక్కిలి ప్రేమపాత్రమగును. ఆరీతిగానే శరీరములు ఇంద్రియములు మొదలయినవి పరమాత్మతో జేరియుండినందున మనకుఁ బ్రీతి పాత్రము లగుచున్నవి. కాని మహావాక్యానుభవ ప్రకారవిచారణమునంజేసి పరమాత్మయే ప్రీతిపాత్రవస్తువని తెలియనగును.

(ఉపమానాలంకారము)

అవతారిక. ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము నిర్ణయంబగుటకుఁ గాను శరీరేంద్రియాది నిషేధమునంజేసి శేషించినరూపే యాత్మయని సమాధాన మేర్పడుచున్నది.

శ్లో॥ అన ణ్వస్థూల మహ్రస్వ, మదీర్ఘమజ మవ్యయమ్ ।
అరూపగుణవర్ణాఖ్యం, తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥

కం॥ తనువును బీనము హ్రస్వం ।
బును దీర్ఘముఁగాక రూపు పుట్టువు వర్ణం
బును గుణము పేరు వొరయక ।
సనాతనంబగునది యె లసద్బ్రహ్మ మగున్ ॥ 61

టీక. తనువును = సూక్ష్మంబును, పీనమున్ = లావయినదియును, హ్రస్వంబును = పొట్టిదియును, దీర్ఘమున్ = పొడవుదియును, కాక, రూపును పుట్టువును వర్ణంబును గుణమును పేరును, పొరయక = లేక, సనాతనంబు = ఎల్లప్పుడును ఉండునది, ఆగుననియే, లసద్బ్రహ్మము = పరబ్రహ్మము, అగును. (తాత్పర్యము సులభము.)

అవతారిక. బ్రహ్మజ్ఞానము బలపడుపొంటె బ్రహ్మ స్వరూపంబింకను మూఁడు శ్లోకంబులతో శ్రీవారిచేఁ దెలియ జేయఁబడుచున్నది.

శ్లో॥ యద్భాసా భాసతేఽర్కాది, ర్భాస్యై ర్యత్తు న భాసతే ।
యేనసర్వమిదంభాతి, తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥ ✓

కం॥ ఏజిగి చే రవ్యాదులు
రాజిల్లెద, రెట్టి దీప్తి రవ్యాదులచే ।
రాజిల్లదెద్ది, దేనను ।
నీజగమెల్లఁ బొలుచునదియె తురీయముగన్ ॥ 62

టీక. ఏజిగిచేన్=ఏకాంతిచేత, రవి+ఆదులు = సూర్యుఁడు మొదలయినవారు, రాజిల్లెదరు = ప్రకాశింతురో, ఎట్టి దీప్తిన్ = ఎట్టికాంతితోడను, రవి + ఆదులచేన్ + సూర్యుడు మొదలయిన వారిచేతను, ఎద్ది = ఏది, రాజిల్లదు = ప్రకాశింపదో, దేనను = దేనినుండి, ఈ జగమెల్లను, పొల్చున్ = ఒప్పునో, అదియె, తురీయము = బ్రహ్మము, అగును.

తా॥ దేనంజేసి సూర్యచంద్రాదులకుఁ గాంతి కల్గునో, సూర్య చంద్రాదులవల్ల దేనికినెట్టి కాంతియును గల్గదో, దేని వలననే ఈవిశ్వంబు ప్రవర్తిల్లుచున్నదో, అదియే పరమాత్మ యగునని భావంబు.

శ్లో॥ స్వయమంతర్బహి ర్వ్యాప్య, భాసయ న్నఖిలంజగత్ ।
బ్రహ్మప్రకాశతే వహ్ని, ప్రతప్తాయసపిండవత్ ॥

కం॥ తప్తమగు నినుపముద్దను
సప్తార్చికరణి సమస్త జగముల వెలిలో ।

వ్యాప్తమగుచు బ్రహ్మమునిజ
దీప్తిని నజ్జగములెల్లఁ దేల్చి వెలుంగున్ ॥ 63

టీక. తప్తము అగు = కాఁచఁబడినదగు, ఇనుపముద్దను (లో), సప్త+అర్చి కరణిన్ = అగ్నింబలె, సమస్తజగముల(యొక్క) వెలిన్ = బయటను, లో (పలను), వ్యాప్తము = వ్యాపించినది, అగుచున్, బ్రహ్మము, నిజదీప్తిని = తన కాంతిలో, ఆజగములెల్ల = ఆలోకముల నన్నింటిని, తేల్చి, వెలుంగును.

తా. అగ్నితప్తంబయిన యాయసగోళంబునందలి యగ్నియన్న భాగంబునకును ఎట్లు వ్యాపించి వెల్గుచుండునో ఆరీతిగానే పరమాత్ముఁ డీలోకంబులయొక్క బయటను లోపలను నిండుకొన్న వాఁడై తాసును వెలుంగుచుండును.

(ఉపమానాలంకారము)

అవతారిక. బ్రహ్మేతర వస్తు వసత్తని సోదాహరణంబుగా శ్రీవారిచేఁ దెల్పఁబడియెడిని.

శ్లో॥ జగద్విలక్షణం బ్రహ్మ, బ్రహ్మణోఽన్యన్నకించన ।
బ్రహ్మాన్యద్భాతిచేన్మిథ్యా, యథామరుమరీచికా ॥

క॥ జగమాత్మకంటె భిన్నం ।
బగునయ్యాత్మకును నన్య మణు వంతయిన ।
న్నెగడదు నెగడినచో మరు ।
మృగతృష్ణలతీరున నది మిథ్యయె తెలియన్ ॥ 64

టీక. జగము, ఆత్మకంటె, భిన్నంబు = ప్రత్యేకంబయినది, అగును, ఆయాత్మకు, అన్యంబు = ప్రత్యేకంబయి

నది, అణువంత అయినన్ = నలకయంత యయినను, నెగ డదు = ఒప్పదు, నెగిడినచో = ఒకవేళనట్లు ఉండినచో, అది తెలియన్ = విచారించినచో, మరు మృగతృష్ణల తీరునన్ = ఎండమావుల రీతిగా, మిథ్యయే = అసత్యమే.

తా. ఎండవేళను జెవిటినేలను జూచినచో నక్కడ నీళ్లుండినట్లు తోఁచును కాని అక్కడనిజముగా నీరుండదు కదా? ఎండయేకదా యుండునది! ఆరీతిగానే ఈ జగత్తంత యును ఆత్మకాకయును, అందు ఆధారాభారవస్తువయిన యాత్మతప్ప వేఱువస్తువును ఉండనందున ఆత్మేతరంబుగాఁ గాన్పించునట్టి యీజగంబు మిథ్యయని వేదాంతోక్తులతో విచారించి తెలిసికొనవలయును.

(ఉపమానాలంకారము)

అవతారిక. ఈయర్థమే దార్ఢ్యముకొఱకు మరలఁ జెప్పఁబడుచున్నయది.

శ్లో॥ దృశ్యతేశ్రూయతేయద్యత్, బ్రహ్మణోన్యన్నతద్భవేత్ ।
తత్త్వజ్ఞానాచ్చతద్బ్రహ్మ, సచ్చిదానంద మవ్యయమ్ ॥

కం॥ ఎవిశ్రుతమును దృష్టము నగు ।
నవియును దత్త్వపతిని నరయఁగ సచ్చినో
దవిశుద్ధైక పరబ్ర
హ్మావిధంబు వహించుఁ బోలవవి యన్యంబై ॥ 65

టీ. ఎవి, శ్రుతమును-వినఁబడి (నవియును), దృష్టముల్=కనఁబడి (నవియును), అగుల్=అగునో, అవియును-అవికూడను, తత్త్వమతిని=విచారణవలన నేర్పడిన తెలివితో, ఆరయఁగన్=విచారించిన యెడల, సత్+చిత్+మోదవిశుద్ధ+ఏకవిధంబుల్-సచ్చిదానందమయమును నిర్మలమును ఏకంబును నయిన బ్రహ్మస్వరూపంబును, వహించుల్=చెందును, అవి, అన్యంబై=ఇంకొక రీతిగ్నై, పోలవు-తోఁపవు.

శ్రీ దో. వేం. గుప్తగారి పాఠాంతర పద్యము.

కం॥ ఎదియెది వినఁబడుఁ గనఁబడు ।
నదియెల్లన్ బ్రహ్మమునకు నన్యముగా-ద ।
య్యది తత్త్వజ్ఞానమునన్ ।
బొదలెడు సచ్చిన్మదముగఁ బొరి నద్వయమై ॥

టీ॥ ఎది యెది, వినఁబడు(నో), కనఁబడు(నో), అదియెల్లను, బ్రహ్మమునకు, అన్యము కాదు, అయ్యది-అది, పొరిన్=బాగుగా తత్త్వజ్ఞానమునన్=విచారణవలసి నిజమయిన తెలివిం జేసి, సత్+చిత్+మయముదముగన్=సచ్చిదానందరూపము గలదిగాను, అద్వయము+ఐ తనకు వేఱులేనిది గానిదిగాను, పొదలెడిన్=ఒప్పును.

తా॥ ఏది యేది కనఁబడినను వినఁబడినను అదియంతయును బ్రహ్మంబేకాని యన్యంబుకాదు. తత్త్వజ్ఞానంబునం జేసి విచారించినచో నదియంతయును సచ్చిదానందమయంబును

నద్వితీయంబును నగు పరమాత్మ యని తోఁపఁగలదని మోక్షా భిలాషి యెఱుఁగవలయును.

అవతారిక:-బ్రహ్మము సర్వవ్యాపి యయినప్పుడు జ్ఞాన నేత్రంబునకే యేల కనుపడవలయును. అజ్ఞాననయనంబున కేల కన్పడఁగూడ దను ననుమానంబునకు సోదాహరణం బయిన సమాధానము.

శ్లో॥ సర్వగం సచ్చిదాత్మానం, జ్ఞానచక్షుర్నిరీక్షతే।
అజ్ఞాన చక్షుర్నేక్షేత, భాస్వంతం భాను మంధవత్ ॥

కం॥ జ్ఞానేక్షణుండు సత్య।
జ్ఞానానంద స్వరూపు సర్వగుఁ గను న।
జ్ఞానేక్షణుండు విలస।
ద్భానుని నంధుండువోలె దర్శింపఁ డొగిన్ ॥

టీక. జ్ఞాన + ఈక్షణుండు = తెల్వియే కన్నుగాఁగల వాఁడు, సత్య = జ్ఞాన + ఆనందస్వరూపున్ = సచ్చిదానంద స్వరూపుండును, సర్వగున్ = అంతటను ఉండువాఁడు (అయిన పరమాత్మను), కనున్ = చూచును, అజ్ఞాన + ఈ క్షణుఁడు= తెల్వికన్ను లేనివాఁడు, అంధుఁడు = గ్రుడ్డివాఁడు! విలసద్భానునిబోలె=ప్రకాశించు సూర్యుని(చూడఁజాలని) రీతిగా, (పరమాత్మను) దర్శింపఁడు = చూడఁడు.

శ్రీ దో. వేం. గు. గారి పాఠాం. పద్యము.

కం॥ జ్ఞాననయనుండు సర్వగు।
నానంద సదాత్ముఁ గాంచే నగు-భాస్వంతున్ ।

భానుం జీఁకు కనుఁగొనమి।

యైన ట్లజ్ఞాన చక్షువాత్మ్నఁగనఁడటుల్ ॥

టీక. జ్ఞాననయనుండు = జ్ఞానమయంబయిన చూపు గలవాఁడు, సర్వగుఁ = సర్వవ్యాపియును, ఆనందసత్ + ఆత్మ = సచ్చిదానంద మయుండయిన యాత్మనిని, కాంచఁ + అగుఁ = చూచుటకు వీలగును, చీఁకు = గ్రుడ్డివాఁడు, భాస్వంతుఁ = ప్రకాశించు వాఁడయిన, భానునిఁ = సూర్యునిని, కనుఁగొనమి = చూడలేకుండుట, ఐనట్లుగా, అజ్ఞాన చక్షువు = జ్ఞానమయముకాని చూపుగలవాఁడు, అటుఁ = జ్ఞాననయనుండు చూచినరీతిగా, ఆత్మఁ = పరమాత్మునిని, కనఁడు = చూడఁడు.

తా. జ్ఞానంబయిన చూపుగల వానికే సర్వవ్యాపియును సచ్చిదానందమయుండును నయిన పరమాత్మునిం గనుంగొన వీలగును. గ్రుడ్డివాఁడు ప్రకాశమానంబుగా సూర్యుండు వెలుంగుచున్నప్పటికిని అతనిని జూడఁజాలని యట్లు అజ్ఞాన నయనుండు పరమాత్మునిని గాంచుటకు వీల్గాదు. శ్రవణాదుల వలన విచారణము గావించి యెఱుకఁ జెందినవాఁడు జ్ఞాని. శరీరేంద్రియములు మొదలయిన వానిని ఆత్మగా భ్రమించిన వాఁడు అజ్ఞాని. జ్ఞానికిఁ బరమాత్ముఁడు కన్పట్టును. అజ్ఞాని కాంచలేనంతలో పరమాత్ముఁడు లేఁడనఁదగునా ?

(పయి రెండు శ్లోకములకుఁ దెలుఁగు పద్యములు దోమా-వేంకటస్వామి గుప్తగారిచే పాఠాంతరములుగా రచియింపఁబడినవి).

అవతారిక. ఆత్మానుభవం బుండినప్పటికిని శ్రవణ మన నాద్యభ్యాసములేనిచో స్వల్పముగా తెల్వి దప్పును గనుక శ్రవణ మననాదులను తప్పక చేయుచుండ వలయు నని సోదాహరణంబుగా శ్రీమదాచార్యుల వారు తెల్పుచున్నారు.

శ్లో॥ శ్రవణాదిభిరుద్దీప్త, జ్ఞానాగ్ని పరితాపితః।
జీవ స్సర్వ మలాన్ముక్తః, స్వర్ణవ ద్ద్యోత తే స్వయమ్॥

కం॥ శ్రవణాదుల నుజ్జ్వలమగు।
నవగతి యను వహ్నిఁ దప్తుఁడగు కూటస్థుం।
డు విశిష్టమలచ్యుతుఁడై।
సువర్ణ ముకరణిఁ దనంత శోభాఢ్యుఁడగున్॥

శ్రవణ + ఆదులన్ = శ్రవణము మననము మొదలయినవానిచేత, ఉజ్జ్వలము + అగు = ప్రకాశించునదగు, అవగతి = జ్ఞానము, అను, వహ్నిన్=అగ్నియందు, తప్తుఁడు=(కాఁచేబడినవాఁడు, అగు, కూటస్థుండు=(ప్రత్యగాత్మ-జీవుఁడు) విశిష్టమలచ్యుతుఁడు + ఐ=సమస్తమయిన దోసఁగుచే విడువఁబడినవాఁడు + ఐ, సువర్ణముకరణి = బంగారువలె, తనంతన్= తనయంతటనే, శోభా + ఆఢ్యుఁడు + అగున్ = కాంతిగలవాఁడు అగును.

తా. బంగారును ఇతర లోహములయొక్క మాలిన్యము క్రమ్మినప్పు డగ్ని సంస్కారంబున నక్కాంచనము యొక్క మాలిన్యంబంతయును తొలంగిపోయి బంగారు స్వయముగాఁ బ్రకాశించురీతిగా పరబ్రహ్మ స్వరూపుండయిన

జీవుని శ్రవణాదులవలన సంసార సంబంధాజ్ఞానము తొలంగి జ్ఞానమయంబయిన స్వయంప్రకాశము చెలంగును.

(రూపకాలంకారము)

అవతారిక. ఈ రీతిని పరిశుద్ధినొందిన ప్రత్యగాత్మ యందు బ్రహ్మస్వరూపాంతఃకరణ ప్రతిబింబితుండై తనను జెందియుండు నజ్ఞానంబును వినాశంబునొందించుకొని సూర్యునివలె నన్నింటిని బ్రకాశము నొందింపుచుఁ దాను బ్రకాశించు నని శ్రీ జగద్గురువులవారు సెలవిచ్చుచున్నారు.

శ్లో॥ హృదాకాశోదితో హ్యాత్మా బోధభాను స్తమోఽపహృత్ ।
సర్వవ్యాపీ సర్వధారీ, భాతిసర్వం ప్రకాశతే ॥

కం॥ హృదయాంబర జనితుండును ।
విదళితతమసుండు సర్వవి స్తృతి భరణా ।
స్పదుఁడగు నప్పరమాత్ముఁడు ।
చిదర్కుఁడై తేజరిలు విశిష్టము వెలయన్ ॥

టీక, హృదయ + అంబర జనితుండును = హృదయంబు అను నాకసంబునుండి యేర్పడినవాఁడును, విదళిత తమసుండు = నశింపజేయఁబడిన అజ్ఞానము (చీఁకటి) గలవాఁడును, సర్వవిస్తృతిభరణ + ఆస్పదుండు = అంతటను వ్యాపించుట- అన్నింటిని భరించుట అను సర్వాతలు కలవాఁడును, అగు, ఆ, పరమాత్ముఁడు, చిత్ + అర్కుఁడై =జ్ఞానసూర్యుఁడై, విశిష్టము=సమస్తమును, వెలయన్ = ఒప్పఁగా, తేజరిలున్ = ప్రకాశించును.

తా. ఏరీతిగా సూర్యుఁడు ఆకాశమునందలి చీఁకటిని బోఁగొట్టి వ్యాపించి తనకుదాఁ బ్రకాశింపుచు నన్నింటిని వెలుంగఁజేయు తెఱంగున అంతఃకరణంబునందు అఖండాకార కృతి రూపంబుతో నుదయించి పరమాత్ముఁడు తనకుఁదాఁ బ్రకాశింపుచు నన్నింటిని దనయందే ప్రకాశింపఁజేయు నఖండానందమయుండై వెలుంగును.

అవతారిక. తెల్వి లేనప్పుడు చేసిన పాపంబులు పోవుటకు తప్పక తీర్థయాత్రలు మొదలయినవి చేయవలయు నను ననుమానంబునకు నాత్మ తీర్థస్నానంబు గావించువారి కే పాపంబులు నేమాత్రమును దాఁకవు గనుక వారికి నేకర్మంబుతోను నవసరంబని శ్రీవారు ఆనతి యిచ్చుచున్నారు.

శ్లో॥ దిగ్దేశకాలాద్య నపేక్ష్యసర్వగం ।
శీతాదిహృన్నిత్య సుఖం నిరంజనం ।
యస్స్వాత్మ తీర్థంభజతే వినిష్క్రియః ।
స సర్వవి త్సర్వగతోఽమృతోభవేత్ ॥

కం॥ నిరతసుఖ నిరంజన సు ।
స్థిరదివ్యము కాలదేశదిక్ప్రముఖ నిమి ।
త్తరహితము శైత్యాద్యప ।
హారణమునై స్వాత్మతీర్థ మఖిలమయమగున్ ॥

ii కం॥ త త్తీర్థరాజసేవాఽఽ ।
యత్తుఁడయి వినిష్క్రియుఁడగు నాతఁడు నిహతో ।
త్పత్తిలయుఁడు సర్వమయుఁడు ।
విత్తాఖిలవిషయుఁ డగుచుఁ బెంపు వహించున్ ॥

టీక. (i) నిరతసుఖ = అంతులేని సౌఖ్యముగలదియును, నిరంజన = చేమురు (చేరిక) లేనిదియును, సుస్థిరదివ్యము - ఎడతెగక బాగుగా నుండునదియును, కాల = అర్ధోదయాది కాలభేదమును, దేశ = పుణ్యక్షేత్రాది దేశభేదమును, దిక్ + ప్రముఖ నిమిత్తరహితము = ఉత్తరము మొదలయిన దిక్కుల భేదమును మొదలయినవి లేనిదియును, శైత్య+ఆది+అపహార రణము=జలుబు మొదలయినదానిని బో.గొట్టునది(స్నానములు ఒకొొక్కప్పుడు జలుబును గల్గించును) యును (అనఁగా చేలి వేఁడిమి మొదలుగాఁ గల ద్వంద్వములకు మించేఁ జేయునది యును)ఐ, స్వ + ఆత్మతీర్థము = తాను అనుతీర్థము, అఖిలమ యము + అగుక్ = అంతటను నిండునదియగును. (ii)తత్ + తీర్థరాజ =శ్రేష్ఠమయిన యా తీర్థముయొక్క, సేవా + ఆయు త్తుఁడు = సేవకు సిద్ధపడి, వినిష్క్రియుఁడు+అగు = నైష్క ర్మ్యము నొందునట్టి, ఆతఁడు, నిహత+ఉత్పత్తిలయుఁడుక్ = జననమరణములు లేనివాఁడును, సర్వమయుఁడును - అన్ని యును నగు వాఁడును, విత్త + అఖిలవిషయుఁడును=అన్నింటిని జెందినవాఁడును, అగుచుక్ = అయి, వెంపువహించుక్ = ప్రకాశించును.

శ్రీ దో. వేం. గుప్తగారి పాఠాంతరపద్యము.

గీ॥ పంచపాది అలరు దిగ్దేశకాలామలాసపడక ।
సౌరిజశీతాదిహార నిత్యసుఖము నాత్మ ।
తీర్థము నిరంజనముఁ గర్మ తెరువు వోని ।
యేఁడు కొలుచు-వాఁడఖిలంబు నెఱుఁగు-నెల్ల ।
యెడలఁ నెంతును-నుండుఁదా నెల్లయపుడు ॥

టీక. అలరు = ఒప్పునట్టి, దిక్ + దేశ + కాల + ఆదులు = దిక్కులు దేశము కాలము మొదలయిన వానిని గూర్చి, ఆసపడక = కోర్కినొందక, సొరిదిన్ = బాగుగా, శీత + ఆది హర = చలి మొదలయిన వానిని (ద్వంద్వములను) హరించునదయిన, నిత్యసుఖమును = ఎడతెగని సౌఖ్య స్వరూపమయిన, నిరంజనమున్ = సుఖదుఃఖముల యొక్క సంబంధము (అంటుఁబడి) లేనిది (అగు), ఆత్మతీర్థమున్ = పరమాత్మ అను తీర్థమును, కర్మ (యొక్క), తెరువు = మార్గము(లో), పోని, ఏఁడు = ఎవఁడు, కోల్చు(నో), వాఁడు, అఖిలంబును = సమస్తమును, ఎఱుఁగును = తెలియును, ఎల్లయెడలను నిండును, ఎల్లయపుడును ఉండును.

తా. చర్మచక్షువునకుఁ దెలియునట్టి యుత్తరము తూర్పు మొదలయిన దెసలును బదరి మొదలయిన ప్రదేశములును అర్ధ సూర్యోదయము మొదలయిన కాలములును అనువానిని గమనించి స్నానంబు గావించినంత ఫలానుభవంబయిన పిమ్మట మరల జన్మింపవలసియుండును. ఆత్మతీర్థమునకు దిగ్దేశ కాలాది భేదంబులు లేవు. పరిపూర్ణంబయినది. దుఃఖము లేనిది. నిత్యస్వరూపంబయినది. జననమరణదుఃఖ నివారణము చేయునది. కాఁబట్టి యీ తీర్థంబును బాహ్య తీర్థంబులతోఁ బోల్పరాదు. కాఁబట్టి యీ గ్రంథముయొక్క భావంబును బాగుగా నెఱింగినవాఁడు, ఆత్మతీర్థమునందు స్నానంబు గావించి పుణ్యపాపంబులు లేక జననమరణ దూరుండై కర్మము లేనివాఁడై ద్వంద్వాతీతుఁడై నిత్యానందమయుండై అంతటను నిండినవాఁడై యుండును.

# అనుబంధము.

## పంచీకరణ వివరణము.

---

(12-వ, శ్లోకము వివరణమునకు ననుబంధము.)

పంచీకరణంబు:— పంచభూతంబులయిన పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులలో నొక్కొక్కదానిని గైకొని దానిని మరల నైదయిదు భాగంబులు గావించిన పిమ్మట మరల నేకీభవింపఁజేయుట.

### పరస్పరంబును గలుపు పద్ధతి.

పంచభూతములలోఁ నొక్కొక్కదానిని ప్రారంభమునందు 2 భాగంబులు చేయునది. ఆ రెండు భాగములలో ఒక భాగమును ప్రత్యేకముగానుంచి రెండవదానిని 4 భాగములు గావించునది. అట్లు భాగించిన 4 భాగములను ప్రత్యేకముగానుంచిన యితర భూతములయొక్క భాగంబులతోఁ జేర్చుటంజేసి పంచీకరణం బేర్పడుచున్నయది.

ఉదాహరణము:—తొలిభూతము పృథివి. దానిని 2 భాగములుచేసి యొకభాగమును ప్రత్యేకంబుగా నుంచి 2-వ భాగమును 4 భాగములు గావించి ఆ 4 భాగములను ప్రత్యేకంబుగా నుంచిన పృథ్వీ భాగంబుతోఁ జేర్పక అప్తేజోవాయ్వాకాశంబు లనఁబడునట్టి మిగిలిన 4 మహాభూతముల యొక్క నాలుగేసిగా విభజింపఁబడిన భాగంబులతోఁ జేర్పవలయును, ఇదేపద్ధతిగా గ్రహింపవలయును.

పయినఁ జెప్పినరీతిని జేర్చుటవల్లఁ గల్గునట్టి మనస్సు మున్నగువానియొక్క పేళ్లను తెల్లముగాఁ దెల్పుట కిక్కడ నొక పటము వ్రాయఁబడుచున్నది.

| | ఆత్మ | స్థూలపంచీకరణము | | | |
|---|---|---|---|---|---|
| ఆ. | (ఆకాశము) అంతఃకరణము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| వా. | సమాన వాయువు | (వాయువు) వ్యానము | ఉదానము | ప్రాణ వాయువు | అపానము |
| తే. | శ్రోత్రము | త్వక్ | (తేజస్సు) చక్షుస్సు | రసన | ఘ్రాణము |
| అప్. | శబ్దము | స్పర్శము | రూపము | రసము (జలము) | గంధము |
| పృ. | వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | వాయువు (పృథివి) |
| | ఆకా. | వాయు. | తేజో. | అప్. | పృథవి. |

ఆకాశము.

దీనిని 4 భాగములుగాఁజేసి వానితో ఇతర భూతభాగములు చేర్చుటంజేసి యేర్పడు తత్త్వములు.

(1) 4 గా భాగింపఁబడిన ఆకాశభాగము ఒకదానితో 4 గా భాగింపఁబడిన పృథివీభాగము చేరుటచే = అహంకారము పుట్టినది.

(2) అట్టి ఆకాశభాగము + అట్టి జలభాగము = చిత్తము.

(3)—డి— + అట్టి తేజోభాగము = బుద్ధి.
(4)—డి— + అట్టి వాయుభాగము = మనస్సు.
4 గా భాగింపఁబడని సగము ఆకాశము అంతఃకరణము.

---

వాయువు-వాయువులు.

వాయ భాగములు 4 టిలో ఒకటి + పృథివి 4 భాగములలో 1 = అపానము.

—డి— + అప్ ... ... ప్రాణవాయువు,
—డి— + తేజస్సు ... ... = ఉదానము.
—డి— + ఆకాశము ... ... = సమానము
విభజింపఁబడని సగము వాయువు వ్యానము.

---

తేజస్సు (అగ్ని) (జ్ఞానేంద్రియములు)
అగ్ని 4 వభా. + పృథ్వీభా. = ఘ్రాణము
—డి— + ఆప్ ... = రసన
—డి— + వాయు ... = త్వక్
—డి—ఆకాశ ... = శ్రోత్రము
విభజింపఁబడని ½ తేజస్సుభా. చక్షుస్సు.

---

జలము (అప్) (విషయములు) ఆప్ భా:-
భా + పృథ్వీభా. = గంధము.
—డి— + తేజోభాగము = రూపము.
—డి— + వాయు ... ... = స్పర్శము.

—డి— + ఆకాశ ... ... = శబ్దము.

భాగింపని జలార్ధాంశము రసము.

---

పృథివి (కర్మేంద్రియములు)

పృథ్వి భా + జల భా = ఉపస్థ.

—డి— + తేజోభా. = పాదము.

—డి— + వాయుభా = వాణి.

—డి— + ఆకాశభా = వాక్కు.

భాగింపని పృథివి అర్ధాంశము = వాయువు.

---

పంచీకరణముల కలగలపు.

పృథివీకదంబము—అహంకా. అపాన. ఘ్రాణేంద్రి. గంధము. పాయ్వింద్రియము.

అప్ ... ... = చిత్తము. ప్రాణవా. రసనేంద్రి. రస. ఉపస్థ.

తేజస్సు. ... = బుద్ధి. ఉదానవా. చక్షురిం. రూప. పాదము.

వాయు ... = మనస్సు - వ్యానవా. త్వగింద్రి. స్పర్శము. వాణి.

ఆకాశ ... =అంతఃకరణము. సమానవా. శ్రోత్రేంద్రి. శబ్దము. వాక్కు.

---

ఇయ్యది పంచీకరణ వివరణము.

---

# పంచీకరణ నిరూపణ పటము.

| | పృథ్వీభాగము. | అప్పుభాగము. | తేజోభాగము. | వాయుభాగము. | ఆకాశభాగము. |
|---|---|---|---|---|---|
| పృథ్వీభాగములు. | $\frac{1}{2}$ పృ = ఘ్రాణేంద్రియము | $\frac{1}{8}$ పృ + అప్పు = ఉపస్థేంద్రియము | $\frac{1}{8}$ పృ + $\frac{1}{8}$ తే = పాదేంద్రియము | $\frac{1}{8}$ పృ + $\frac{1}{8}$ వా = పాణీంద్రియము | $\frac{1}{8}$ పృ + $\frac{1}{8}$ ఆ = వాగింద్రియము |
| అప్పుభాగములు. | $\frac{1}{8}$ అప్పు + $\frac{1}{8}$ పృ = గంధము | $\frac{1}{2}$ అ = రసము | $\frac{1}{8}$ అ + $\frac{1}{8}$ తే = రూపము | $\frac{1}{8}$ అ + $\frac{1}{8}$ వా = స్పర్శము | $\frac{1}{8}$ అ + $\frac{1}{8}$ ఆ = శబ్దము |
| తేజోభాగములు. | $\frac{1}{8}$ తే + $\frac{1}{8}$ పృ = ఘ్రాణేంద్రియము | $\frac{1}{8}$ తే + $\frac{1}{8}$ అ = రసనేంద్రియము | $\frac{1}{2}$ తే = చక్షురింద్రియము | $\frac{1}{8}$ తే + $\frac{1}{8}$ వా = త్వగింద్రియము | $\frac{1}{8}$ తే + $\frac{1}{8}$ ఆ = శ్రోత్రేంద్రియము |
| వాయుభాగములు. | $\frac{1}{8}$ వా + $\frac{1}{8}$ పృ = అపానవాయువు | $\frac{1}{8}$ వా + $\frac{1}{8}$ అ = ప్రాణవాయువు | $\frac{1}{8}$ వా + $\frac{1}{8}$ తే = ఉదానవాయువు | $\frac{1}{2}$ వా = వ్యానవాయువు | $\frac{1}{8}$ వా + $\frac{1}{8}$ ఆ = సమానవాయువు |
| ఆకాశభాగములు. | $\frac{1}{8}$ ఆ + $\frac{1}{8}$ పృ = అహంకారము | $\frac{1}{8}$ ఆ + $\frac{1}{8}$ అ = చిత్తము | $\frac{1}{8}$ ఆ + $\frac{1}{8}$ తే = బుద్ధి | $\frac{1}{8}$ ఆ + $\frac{1}{8}$ వా = మనస్సు | $\frac{1}{2}$ ఆ = అంతఃకరణము |

ఆయా భూతభాగములు ఇతర భూతభాగములతో చేరునప్పుడు $\frac{1}{8}$, $\frac{1}{8}$ భాగములు చేరును. ఈ రీతిగా ప్రతి భూతముయొక్క $\frac{1}{8}$ భాగములు నాలుగే ఇతర భూతభాగములతో చేరును. మిగిలిన $\frac{1}{2}$ భాగములు ఇతరభూతభాగములతో చేరవు. ఆ రీతి పయిని పటమువల్ల తెలియ నగును.

ఈ పుస్తకములు వలయువారీ దిగువ అడ్రసుకు వ్రాయవలయును.

(1) జె. కృష్ణరావుగారు, బి,యె. బి.యల్. (వక్కీలు) చిత్తూరు.

(2) విద్వాన్. టి. ఆర్ముగం పిళ్లెగారు, పండితులు. ముత్యాలుపేట హైస్కూలు, మదరాసు. జి. టి.

(3) శ్రీ కవిభూషణ శతావధాని, విద్వాన్, దోమా. వెంకటస్వామి గుప్తగారు. 35-37 తంబుచెట్టివీధి . మద్రాసు.